


బొమ్మల కొలువు ముచ్చట

అక్టోబర్

# 6

విడుదల

నాగూర్ సినీ ప్రొడక్షన్సు వారి

# ఇద్దరు పెళ్లాలు

యం.వి.రాజమ్మ * యన్.టి.రామారావు *
సి.యస్.ఆర్ * జమున * శివరావు
నటించినది...



డైరెక్టర్:
నాగూర్

# మహిళల ఆరోగ్య రక్షణకు

## లోధ్ర

### గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూలలు, బహిష్టు కాకుండుట, అకాలబహిష్టు, మైల జాస్తిగాను తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మ వ్యాధులను కుదుర్చును.

12 ఔ. రు. 4-4-0   6 ఔ. రు. 2-4-0

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణిస్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తలతిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము. జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది సేవ జేయుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-4-0

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాలప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుమునొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, ఆలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయేగాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-2-0   6 ఔ॥ రు. 5-8-0

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతుస్రావ దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0-0

## సౌభాగ్య శొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగనున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారు చేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0-0

## ప్రమేహాంతకం

### (తెల్లబట్టవ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీజబ్బు సర్వసాధారణముగనుండును. పసిపిల్లలకుగూడ యీవ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీవ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0-0

## కేసరి కుటీరం లిమిటెడ్

**16, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు 14**

తెనుగుజిల్లాలకు, నైజాముకు ఏజంట్లు

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికింద్రాబాదు

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక

వ్యవస్థాపకులు

## డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య



సంపుటము ౨౩]    అక్టోబరు 1954    [సంచిక ౧౦



# విషయ సూచిక





దీపావళి జ్యోతులు







జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !

---

## ఉత్సవాలు - వేడుకలు

ఈ నెల మొత్తం ఆబాలగోపాలానికి వేడుకరోజులు. దేశం మొత్తంమీద ధనకనకవస్తువాహనాలతో కళకళలాడుతూ ప్రతి గృహము కోలాహలముగా నుండే సమయము.

ఈ కోలాహలానికి కారణాలు ఒకదాని వెంబడి ఒకటి-దసరా, ఆంధ్రరాష్ట్రావతరణ ప్రథమవార్షికోత్సవము, గాంధీజయంతి, దీపావళి పర్వదినాలు. ఎప్పటి నవరాత్రుత్సవాలు బొమ్మకొలువులు, దేవీ ఆరాధనలు, బాలల 'జయ-విజయీభవ' ధ్వానాలు, పేరంటాండ్ర హడావుడులతో గడచిపోయినవి.

ఆంధ్ర ప్రథమ జయంత్యుత్సవాలు ఊరూర, వాడవాడల అత్యంతోత్సాహంగా తెలుగు ప్రజానీకమున్న దేశీయ, విదేశీయ ప్రాంతాలన్నిటిలోను జరుపబడినవి.

పురాణాలలో శిబిచక్రవర్తి శరణాగత రక్షణార్థము డేగకు తన దేహమునుండి మాంసమునుకోసి యివ్వసమకట్టాడని ప్రసిద్ధి. దానిని మించిన త్యాగముచేసి ఆంధ్ర రాష్ట్ర రక్షణ నిర్మాణమునకు దోహదంచేశాడు శ్రీ పొట్టి శ్రీరాములు. స్వభాష,

సంస్కృతి, జాతీయపురోభివృద్ధికి ప్రత్యేకరాష్ట్ర నిర్మాణం తక్షణమే జరుగాలని నమ్మి దాని సాధనకై నిరాహారదీక్షపూని, ఆత్మ ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు పరితపించు చుండగా, క్రమంగా తన ప్రాణాలనే తన స్వప్రజా శ్రేయస్సుకు త్యాగంచేశాడు. ఇట్టి స్వార్థరహితుని తపోమహిమ, చేసిన త్యాగము ఫలితమే తెలుగు ప్రజానీకంలో చల్లబడియుండిన చైతన్యం ప్రజ్వరిల్లడం, ఆంధ్రరాష్ట్ర నిర్మాణమున్నూ. ఈ నాటి రాష్ట్రావతరణ వార్షికోత్సవ సందర్భమున మొదట శ్రీరాములుగారికి అంజలి ఘటించి తర్వాత తదితర కార్యక్రమాలలో ప్రతియొక్కరు పాల్గొని యుండాలి. 'ఇల్లు అలుక గానే పండుగ కాలేదు' అన్నట్లు రాష్ట్రసిద్ధితో శ్రీరాములుగారి త్యాగం, తపస్సు, ఉద్దేశాలు ఫలించినట్లు కానేరదు. అందులోని ప్రజలు సమరస సమైక్య, సద్భావాలతో తమ సమస్యలను పరిష్కరించుకొని, బాధ్యతతో తమ రాష్ట్రం స్వయంపోషకం, స్వయం సమృద్ధమయి, ఆదర్శనీయమైనదగుటకు కృషి జరుగాలి. ఇట్టి పురోగమనమే పరలోకవాసి శ్రీ శ్రీరాములుగారి ఆత్మకు శాంతిని సమకూర్చగలదు.

గాంధీజయంతిని ప్రతిఏటా జరుపుతున్నాము. కాని స్వాతంత్ర్యసిద్ధికి మును పటికంటే తర్వాత జాతీయపురోభివృద్ధికి ఆయన చూపిన మార్గం, బోధించిన బోధనలు తమ ప్రాధాన్యతను కోల్పోవుతున్నవా అనిపించుచుండుట విచారకరము. శాంతి అభ్యుదయాలకు, సర్వమానవ సౌభ్రాతృత్వానికి గాంధీజీ చూపిన వెలుగే శరణ్యమని దేశదేశాలలోని ప్రజలు శ్లాఘిస్తూనే యున్నారు. కాని వానిని ఆచరణలో పెట్టడానికిగల అవరోధాలు దురూహ్యములు. జాతీయ సమరంలోనేమి, జాతీయ నిర్మాణంలోనేమి వారి ననుసరించి, వారి నిర్మాణ కార్యక్రమాన్ని ఆచరణలోపెట్టి, దానిని దేశానికంతటికి చాటిన యీ నాటి జాతీయవాదులకే గాంధీజీ నిర్మాణ కార్యక్రమం పట్ల శ్రద్ధతగ్గడం చాల విచారకరము. ఇక రాముడు, కృష్ణుడు పటాలనుపెట్టి, విగ్రహాలనుపెట్టి పూజించడం, ఊరేగించడంలాగ జరిగే స్థితికి గాంధీజయంతి వచ్చిందంటే గాంధీజీ దేశానికి, ప్రజల శ్రేయస్సుకు చేసిన అమోఘమైన సేవ గణ్యాత కెలావస్తుందో మీరే యూహించండి! గాంధీజీ నిర్మాణ కార్యక్రమం యీ నాడు, ఆ నాడు అనే విచక్షణ కతీతమయినది. దానిని ఆచరణలో పెట్టడమంటే భారత ప్రజానీకం తమ అభ్యుదయ పురోభివృద్ధులను తీర్చిదిద్దుకోడమే.

రానున్న దీపావళి వేడుకలు పిన్నలను, పెద్దలను సన్నద్ధులను చేస్తుండాలి. నూతన వస్త్రాలేమిటి, ఆభరణాలేమిటి, టపాకాయలేమిటి, రాకపోయే బంధుమిత్ర పరి

వారాలేమిటి! - కాని దుబారాను, అనవసర ఖర్చులను అరికట్టి పర్వదినపు విశిష్టతకు పరిమితమయితే చాల మంచిది.

దీపావళికి ప్రాముఖ్యత లోకకంటకుడైన నరకాసురవధతో వచ్చినది. నరకాసురవధ ఫలితంగా తమకు సమకూరిన శాంతిభద్రతలపట్ల హర్షామోదాలను ప్రకటిస్తూ దానికి కారకులైన శ్రీకృష్ణ పరమాత్మ దంపతులను ఆరాధించి, పూజించి, వేడుకలు జరుపుకునేది దీపావళి. జరిపే వేడుకలు, ఉత్సవాలు భగవత్ప్రీతితోబాటు సర్వప్రజానీకం సుఖానందాలకు దోహదమయ్యేవిగా నుండాలని మా కోర్కె.

ఈ సందర్భమున మా 'గృహలక్ష్మి' మీ అందరి మధ్య మీ ఆదరాభిమానములకు పాత్రమయి, మీతోబాటు లోకకళ్యాణమునకు కృషిచేయాలనే ఉత్సాహముతో మీకడ చేరింది.



# తల్లి - బిడ్డలు

కుమారి ఎన్. సులోచన

"అలాగైతే రాజుని ఇక్కడే వదలిపెట్టి పొమ్మంటావా?" విచారం ఉట్టిపడే సదాశివం మాటలు విని తనలోతానే నవ్వుకుంది భారతి.

"ఆడవాళ్ళు ప్రసవించడానికని పుట్టింటికివస్తే తమ పెద్దపిల్లల్ని కూడా తీసుకురారా ఏమిటి? ఎందుకింతగా యోచిస్తున్నారు?"

"అ ... అదిగాదు - రాజు నీసొంత కొడుకైతే యేయోచనా ఉండేదిగాదు. సవతి బిడ్డడిక్కడ వదిలిపోతే మీవాళ్లేమైనా ..." సదాశివం వాక్యాన్ని పూర్తిచేయకముందే భారతి ముఖం ముడుచుకుంది.

"బాగానేఉంది. ఎందుకిలా 'నాబిడ్డ, సవతిబిడ్డ' అని భేధాలు కల్పించి మాట్లాడతారు? రాజా నన్ను 'అమ్మా' అని పిలుస్తాడు. నేనూ రాజుని నా బిడ్డగానే భావిస్తున్నాను, ఇంతకన్నా ఇంకేం కావాలి?"

ప్రేమ భరితమైన భారతి వేడుకోలును తిరస్కరించే ధైర్యం చిక్కలేదు సదాశివానికి. ఇంతలో నాలుగేళ్ల రాజు అమ్మను వెతుక్కుంటూ వచ్చేశాడు. సదాశివం వాణ్ణి తన ప్రక్కకు లాక్కుని బుజ్జగిస్తూ అడిగాడు.

"రాజా! అమ్మకు ఒంట్లో బాగా లేదు. ఇక్కడే అమ్మమ్మ దగ్గిర కొన్ని రోజులుంటుంది. నువ్వు నాతో రేపు ఊరికొస్తావా? అమ్మ తర్వాత వస్తుంది." సదాశివం నయంగానే అడిగినప్పటికీ ఆ మాటల్లో దాగిన క్రౌర్యాన్ని తెలుసుకోలేకపోలేదు రాజు. వెంటనే తండ్రి పట్టువదిలించుకొని, భారతి దగ్గరకివెళ్లి ఆమె ఒళ్లో కూచున్నాడు.

"అమ్మ నొదిలేసి నేను రాను నాన్నారూ! మీరు కావలిస్తే వెళ్లండి ఊరికి. నేను ఇక్కడే అమ్మతో ఉంటాను. ఊహు ... అల్లరిచేయనుగా. ఏమ్మా?" తల్లి మెడకు తన చిన్ని చేతులు పెనవేసి ముద్దుగా అడిగాడు.

భారతి పిల్లాణ్ణి గట్టిగా కావలించుకుంది. "విన్నారా; రాజా మాటలు? నాకూ, నా బిడ్డకూ మధ్య అడ్డంరాకుండా మర్యాదగా తొలిగిపొండి." అని కొంటెగా నవ్వింది.

సదాశివం మొదటి భార్య మాలతి చనిపోయినప్పుడు రెండు నెలలు నిండలేదు రాజుకి. మాలతి వల్ల పొందని ప్రేమానుభవాన్ని, పిల్లాడివల్ల పొందవచ్చునని ఆశపడ్డాడు సదాశివం. అంతకంటే వేరు మార్గమూ తోచలేదు. కాని త్వరలోనే అతని అదృష్టం ప్రేమమూర్తి, శాంతమూర్తి అయిన భారతి రూపంలో ఎదురొచ్చింది అతనికి. భారతి సదాశివంను చేపట్టి గృహలక్ష్మిగా ఇంట ప్రవేశించింది. ఆర్నెల్ల పసికూనను ఆమె చేతుల్లో పెట్టేసి, ఆ లేచిగురు వాడిపోకుండా ఉండటానికని ఇన్నిరోజులూ తినుపడ్డ కష్టానుంచి విముక్తి చెందాడు సదాశివం. 'అమ్మా' అని పిలవడానికి నేర్చుకుంది మొదలు, ఆ మాటను భారతికోసమే ప్రయోగించాడు రాజు. భారతికూడా, "ఎప్పటెప్పటికీ రాజు నా కొడుకే"నని తీర్మానించుకుంది గట్టిగా. ఈ తీర్మానంచేతనే ముగ్గురి జీవితాలూ సుఖపడ్డాయి.

"అమ్మా! అన్నం పెట్టమ్మా" అని అడిగాడు రాజు. పడుకున్న భారతి మెల్లగా లేచింది. కొద్దిదూరంలో బియ్యం ఏరుతూ కూర్చున్న జానకమ్మకు ఒళ్లు మండిపోయింది. జానకమ్మ భారతి తల్లి.

"ఇదేమిటే, ఈ పిల్లడు నిన్నొక్క నిముషం నడుంవాల్చనీడు. ఇదేం గారాబమే? కొట్టకుండా, తిట్టకుండా పెంచుతున్నావ్ కాబోలు!"

"నా పిల్లాణ్ణి నేనెందుకు కొట్టాలమ్మా ?"

"అవును. నీ పిల్లాడు పాపం ! పదినెల్లు మోసి కన్నావ్ !" మూతి విరుచుకుంటూ అన్నది జానకమ్మ.

"అమ్మా ! నువ్విలా మాట్లాడడం నాకేమీ నచ్చలేదు. పిల్లాడి కిదంతా తెలిస్తే బాగుండదు. మనసు కష్టపడతాడు."

"అయ్యో, ఎక్కడలేని బిడ్డడు ! లోకంలో సవతి తల్లులంతా ఇలాగే ఉన్నారటే ?"

"అమ్మా ! అమ్మమ్మకే నేనంటే నచ్చడంలేదు కాబోలునమ్మా." అనుకుంటూ రాజు భారతికి మరీ దగ్గిరగా జరిగి కూర్చున్నాడు.

"అమ్మమ్మకేంలే రాజా ! నేనన్నంపెడతా, తిందువుగానిరా."

"అమ్మా ..."

"ఏం బాబూ ?"

"మరే ... నీ ఒళ్ళో కూర్చుని తింటానమ్మా అన్నం ..." బ్రతిమాలుతున్నట్లుగా అడిగాడు, అమ్మమ్మ ఏమంటుందో అనే భయంతో.

జానకమ్మ ఇక ఓర్వలేకపోయింది. "బాగుంది వరస. బుద్ధిలేదుట్రా నీకు ? ఒళ్ళు బాగా లేకనే కదూ అమ్మ పడుకుంది. ఆవిడ్ని లేపడం చాలదని ఒళ్ళోకెక్కి తందనాలు తొక్కుతానంటావ్ ?"

భారతి తల్లివేపు కోపంగా చూచింది. రాజు మొహం చిన్నబోయింది. "అమ్మా ! మన ఊళ్ళో మరి నన్ను నీ ఒళ్ళో కూచోబెట్టుకొని అన్నం తినిపించేదానవుకదూ, అందుకనే అడిగాను. నీకు కష్టంగా ఉంటే ఒద్దులే అమ్మా." దుఃఖం పొంగి పొర్లింది ఆ మాటల్లో.

పిల్లాడి కళ్లు చెమ్మరించడం గమనించి భారతి వెంటనే వాణ్ణి తన ఒళ్ళోకి లాక్కుంది. కళ్లు తుడుస్తూ "ఏడవకు రాజా ! అమ్మమ్మ మాటల కేంలే. ఆమెది పిచ్చిగాని, మీ అమ్మను నేనున్నానుగా ప్రక్కన. నువ్వు ఒళ్ళో కూచుంటే మీ అమ్మకెక్కడైనా కష్టంగా ఉంటుదట్రా బాబూ ? ఏడవకుండా, బుద్ధిగా అన్నంతిను చూద్దాం" అని ఒక ముద్ద తన చేత్తో తినిపించింది. రాజు కొంచెం నెమ్మదిజెంది అమ్మనుచూచి నవ్వాడు. భారతి మృదువుగా తల నిమురుతూఉంటే, అమ్మకి కష్టంగా ఉంటుందేమోనని ఒళ్లోంచి దిగి కూచుని అన్నం తిన్నాడు.

భారతి కడసారి చెల్లెలు సరోజ, పదేళ్ల పిల్ల. రాజుతో ఆటలాడడమంటే ఆమె కెక్కడలేని సరదా. ఒక రోజు సరోజ ఏదో పాఠం వ్రాస్తుండగా చూశాడు రాజు. "నేనుకూడా రాస్తానమ్మా" అని అమ్మ నడిగాడు.

"సరో, నీ దగ్గర పెనసలు ముక్క ఉంటే వాడికియ్యి" అని భారతి అడగ్గా సరోజ తన దగ్గిరుండిన క్రొత్త పెన్సిలు రాజు చేతిలో పెట్టింది. ఆ సమయంలో అక్కడికి వచ్చిన జానకమ్మ పెన్సిలు రాజు చేతుల్లోంచి లాక్కుంది. "పాడుపిల్లకు కొంచెమైనా బుద్ధిలేదు. రోజు కెన్ని పెనిసిళ్లు పారేసుకుంటుందోగదా. ఎవతో కన్నబిడ్డలకు పెన్సిళ్లు సప్లయి చేస్తుంటే మనం గట్టెక్కినట్లేలే" అని విసుక్కుంది.

సరోజ పాపం దిగాలుపడిపోయి నించుంది. భారతి తల్లిని చూచింది నిప్పులు కక్కుతూ. ఏదో చెప్పాలనుకుంది. కాని చెప్పలేదు. రాజు అమ్మమ్మ కోపానికి భయపడి అమ్మ దగ్గిరకివచ్చి ఆమె శరీరాని కంటుకొని కూర్చున్నాడు. "అమ్మా ! అమ్మమ్మ ఏమంటోందే ?" 'ఎవతో కన్నబిడ్డ' అనే మాటల నర్థం చేసుకునేశక్తి లేదతడికి.

భారతి పిల్లాణ్ణి హృదయానికి హత్తుకుంది. "అమ్మమ్మ మాటలు నువ్వు వినిపించుకోకు రాజా ! మనం ఇక్కడికి రాకుండానే ఉంటే బాగుండేది. పోనీలేగాని - నీకు పెన్సిలేగా కావాలి ? ఎన్ని

కావాలిచెప్పు? ఇంకేం కావాలి? బంతా? రైలా? మోటారా? చెప్పు ఏమేం కావాలో?"

తల్లి అనిన మాటల్ని తన బుజ్జగింపుతో మరిపించే యాలనుకుంది భారతి. వెంటనే నౌకర్ని బజారుకు పంపించి, కొత్త పెన్సిలూ, కొన్ని ఆటసామాన్లూ తెప్పించింది. రాజు, తల్లి ఒళ్ళో పిల్లి కూనలా ఒదిగి కూర్చుని, జానకమ్మను కలవరం చిందే చూపులతో మాటిమాటికి చూస్తూ, అమ్మ తెప్పించిన వస్తువులతో ఆడుకున్నాడు.

"భారతీ, వెళ్ళి కాస్సేపైనా పడుకో" అన్నది జానకమ్మ.

"పిల్లాడికి తలదువ్వి, బొట్టుపెట్టి తర్వాత పడుకుంటాలే అమ్మా!"

"నీ గారాబపు కొడుక్కి నే దువ్వనా ఏమిటే?"

"నేదువ్వితేనే నా రాజుకి తృప్తిగా ఉంటుందమ్మా." జానకమ్మ ఇంట్లోకి వెళ్ళిపోయింది విసురుగా.

పిల్లాణ్ణి భారతి ఒళ్ళో చూచినప్పుడల్లా కోపంతో పొంగిపోయేది జానకమ్మ. రాజు ఎప్పుడూ భారతి దగ్గరే ఉండటంచేత తన కూతురికి బొత్తిగా నెమ్మది చిక్కడంలేదని ఆమె విశ్వాసం. పూర్ణ గర్భిణి కూచోవడానికీ, లేవడానికీకూడా కష్టపడుతున్నప్పుడు, పిల్లాడు వేపుకుతినడం కాకుండా, తనకూ తన కూతురికీ కాకుండా చేస్తున్నాడని రాజుమీద క్రోధం పెంచుకుంది రోజు రోజుకీ. ఏ విధంగా తన కసి వెళ్లబోసుకుందామా అని చూస్తుండేది ఎప్పుడూ. ఆమె కోపంనుండీ తప్పించుకోడానికి తల్లి ఒళ్లో దాక్కోవడమే సరైన విధానమని తెలుసుకున్నాడు రాజు. తల్లితోనే ఉండటం, తల్లితో భోంచేయడం, తల్లిదగ్గరే కూర్చుని ఆడుకోడం, పడుకోడంకూడా తల్లిదగ్గరే. జానకమ్మ క్రోధాగ్ని కిదంతా ఆజ్యమయ్యేవి.

"భారతీ - నువ్వు చేసేదేం బాగాలేదు సుమా. ఒంట్లో బాగుండకపోయినా ..."

"అమ్మా, ఏదీ నీ ఒడి చూపించు. నేనే ... మరి నీ ఒళ్ళో తలపెట్టి పడుకుంటా - ఎప్పట్లాగా. పాట పాడతావా అమ్మా."

"అదే కొరతైంది నాయనా. పాపం బుచ్చి పాపాయి. ఉయ్యాల్లో పడేసి జోకొట్టమ్మా భారతీ. పళ్లు రాలగొట్టక..." అని తన పళ్ళు రాలిపోయేలా కొరుక్కుంది జానకమ్మ.

రాజుకీసారి కోపం వచ్చింది. "మా అమ్మ నా కోసంపాడితే నీకేం కష్టం?" అనేసి భారతి ఒళ్ళో తలపెట్టుకొని కుదురుగా పడుకున్నాడు. ఛటుక్కున ఏదో జ్ఞాపకంవచ్చి తలెత్తి తల్లిముఖంవేపు చూశాడు.

"ఏం రాజా పడుకో."

"నేను పడుకుంటే నీకు కష్టంగా ఉందా అమ్మా?"

భారతి చిరునవ్వు నవ్వింది. బిడ్డను మళ్ళా ఒళ్లోకి లాక్కుని ముద్దు పెట్టుకుంది.

ఆ రోజు ప్రొద్దున్న లేచినప్పట్నుంచీ అమ్మ కనిపించలేదు. ఇల్లంతా వెతుకుతూ "అమ్మా, అమ్మా" అని పిలిచాడు రాజు.

"ఊ అరవకు. అమ్మట అమ్మ" అని మందలించింది జానకమ్మ. ఇంట్లో అందరూ ఏదో తొందరలో ఉన్నారు. ఎవరెవరోవచ్చి మాట్లాడిపోతున్నారు. "హాస్పిటలు" "మొగపిల్లాడు" అని ఏమేమో మాట్లాడుకుంటున్నారు. రాజుకేమీ అర్థం కాలేదు.

"అమ్మెక్కడికెళ్లిందీ? నిన్నరాత్రికూడా నా ప్రక్కనే పడుకుందే?"

"నువ్వావిడ్ని ఒక్క నిమిషంకూడా అటూ ఇటూ పోనీక ప్రాణం తీశావుకదూ. అందుకనే ఆస్పత్రికి వెళ్లిపోయింది. అక్కడైనా కొద్దిరోజులు నెమ్మదిగా ఉండనీ."

ఆ మాట వినగానే రాజు గుండెల్లో గతుక్కుమంది. "ఆసుపత్రా! అమ్మ అక్కడి కెందుకు

వెళ్ళిందీ ? నేనల్లరి చేశాననా ?"

"అవును."

"అక్కడ మరి డాక్టర్లు అమ్మను చూడి పోడ వరూ ?"

"ఎందుకు పోడవరూ, నువ్విలా అల్లరి పిల్లాడై యుంటే ?"

రాజు కళ్ళనీళ్ళ పర్యంతం అయిపోయాడు. "అమ్మమ్మా, నన్నమ్మ దగ్గిరకి పిల్చుకెళ్ళవూ ? నేనిక అమ్మని తొందర చేయనుగా దేనికీని. నేనమ్మను చూడకుండా ఉండలేను. అమ్మను ఇక్కడికి పిల్చుకొచ్చేద్దా మమ్మమ్మా."

"సరేలే. నోరుముయ్. అక్కడికికూడా వెళ్ళి దానిగొంతు కోస్తానంటావ్."

ఆ రోజంతా రాజు 'అమ్మా అమ్మా' అని ఏడుస్తూనే ఉన్నాడు. ఎవ్వరూ వినిపించుకోనైనా లేదు. ఏడ్చిఏడ్చి ముఖమంతా వాచిపోయింది. దిక్కుదివాణంలేని ఒంటరి పక్షిలా ఐపోయాడు. ఎంతో బ్రతిమాలుకున్నా జానకమ్మ వాణ్ణి ఆసుపత్రికి తీసుకువెళ్ళడానికి ఒప్పుకోలేదు.

"అమ్మమ్మా ! అమ్మను చూడటానికే వెళ్తున్నావ్‌కదూ ? నేనుకూడా వస్తానే. అల్లరిచేయను. దగ్గిరకైనా వెళ్ళకుండా దూరంనుంచే చూసేసి వచ్చేస్తా నమ్మమ్మా !"

"ఆసుపత్రికి చిన్నపిల్లలు రాకూడదు. వస్తే ముక్కు కోసేస్తారు. నువ్విక్కడేపడిఉండు." అని నిర్దాక్షిణ్యంగా చెప్పేసి, తన మనమడికోసం క్రొత్తగా ఏదైనా సామాను తీసికొని సంతోషంతో పొంగుతూ కార్లోవెళ్ళి కూర్చుండేది జానకమ్మ.

అమ్మని చూడని దుఃఖంచేతా, అమ్మమ్మ మీది కోపంచేతా, రాజు తన వశంలోలేడు. అప్పుడే జరిగింది ఆ ఘటన.

సరోజ ఏదో తొందరలో తన పెన్సిలుకు బదులు రాజు పెన్సిలు తీసుకుంది వ్రాయడానికి. అమ్మ దూరమైనది మొదలు, ఆమె కొనిపెట్టిన సామాన్లను అతి జాగ్రతగా దాచుకొని కాపాడుకుంటున్న రాజు పెన్సిలు కనిపించకపోగానే పెద్దపెట్టున యేడ్పు ప్రారంభించాడు.

"నేనే తీసుకున్నానురా" అంది సరోజ.

ఒక్కపెట్టున సరోజమీది కురికాడు రాజు. అ "మా అమ్మ నా దగ్గిర లేదుగదా అని ఆమె కొనిపెట్టిన పెనిసలుకూడా లాక్కుంటున్నావా ? ఇచ్చేయ్‌దాన్ని" అని అరుస్తూ పెన్సిలు లాక్కున్నాడు.

జానకమ్మ గల్లంతువిని పరుగెత్తుకు వచ్చింది. మండిపడుతూ రాజు నివతలకులాగి వీపున కసిదీర దాలుగంటించింది. "అమ్మ ఎవరోయ్ నీ అమ్మ ? భారతి నీకు తల్లిగాదు. సరోజకే ఆమె అక్కయ్య తెలుసా. నీకేబాధ్యతాలేదు."

రాజు కొంచెంసేపలాగే చూస్తూ నుంచున్నాడు. "నాకు అమ్మ లేకేం ? ఆసుపత్రిలో ఉందిగా మా అమ్మ ?"

"ఆమేం నీకు అమ్మగాదు. నీకు అమ్మ అసలు లేనేలేదు. చచ్చిపోయింది."

"అబద్ధం చెప్తావేం ? ఆమె మా అమ్మే" గట్టిగా అన్నాడు.

"కాదుకాదు. ఆమె కడుపున నువ్వు పుట్టనేలేదు. నీకూ, ఆమెకూ ఏసంబంధంలేదు. నువ్విన్ని రోజులు ఆమెను అమ్మనుకున్నావ్ పొరపాటున. భారతికూడా 'నువ్వు తన పిల్లాడివికా'వని చెప్పకుండానే ఊరుకుంది. అంతే తెలుసా. నువ్వు అమ్మలేనివాడివి. జ్ఞాపకం ఉంచుకో."

హృదయానికి తగిలిన సమ్మెటపోటు దెబ్బలతో రాయిలా నించుండిపోయాడు రాజు, కోపంగా జాన

కమ్మను చూస్తూ. ఉన్నట్టుండి ఆమెమీదపడి తన చిన్ని పిడికిళ్ళతో ఆమెను గుద్దుతూ, కళ్ళ నీళ్ళు గారుస్తూనే "అమ్మ నా అమ్మే, నా అమ్మే" అని అరిచాడు పెద్దగా.

పిల్లాడి చేతులు పట్టుకొని దూరంగా నెట్టింది జానకమ్మ. "చాల్లేరా అరుపులు నీకు అమ్మ లేదసలు. భారతికీ నీకూ యే సంబంధమూ లేదు." అని ఆ లేత హృదయాన్ని సూదిలాంటి మాటల్తో తూట్లుచేసి వెళ్ళిపోయింది వంటగదిలోకి.

రాజు భారతి గదిలోకి వెళ్ళి ఒక మూల కూర్చున్నాడు. చాలా సేపటివరకు అక్కడనుండి లేవలేదు. "నాకు అమ్మ లేదా?" అనుకొని క్రుంగిపోయాడు. ఇన్నిరోజులనుంచి తన తల్లి అనుకొన్న మనిషి నిజంగా తన తల్లి కాదన్న విషయం తలపుకు రాగానే దుఃఖం ఆపుకోలేక బోర్లపడుకొని వెక్కి వెక్కి యేడ్చాడు. అమ్మ లేదనగానే ఈ లోకంలో తనకిక యేమీ లేదనిపించింది, వాడికి. భారతిచూపిన ప్రేమే వాడి ప్రపంచం. ఆ ప్రేమ ననుభవించడానికి తనకే విధమైన హక్కూ లేదని జానకమ్మ మాటలవల్ల ఒకవిధంగా అర్థమయింది. అతని ప్రపంచం హఠాత్తుగా శూన్యమయిపోయింది.

ఆ రోజునుంచి అమ్మను చూడాలన్న తన ఆశను వెలిబుచ్చలేదు రాజు. ఆమె కొనిపెట్టిన సామాన్లనన్నింటినీ సరోజగదిలో తీసుకెళ్ళి పెట్టేశాడు. ఎప్పుడూ ఒక మూల కూర్చుని ఏడుస్తూ గడుపుతున్నాడు. రోజురోజుకీ ఆ పసిహృదయం ఏదో తెలియని ఆవేదనతో నిండిపోయింది.

ప్రసవించిన ఏడోరోజు భారతి ఇంటికి వచ్చింది. ఇల్లాంతా ఒకే సందడిగా ఉంది. తాత, అమ్మమ్మ, పిన్నమ్మలు, మామలు, అందరూ పాపాయి చుట్టూ మూగి "చిట్టి తండ్రీ, పొట్టి తండ్రీ" అంటూ ఒకళ్ల తర్వాత ఒకళ్లు ఒళ్లోపెట్టుకొని ఆటలాడించారు. ఇంతమందిలోనూ భారతి కళ్లు రాజుని వెతికాయి. రాజు వీళ్లమధ్య తనకిస్థానం లేదనుకొన్నట్లు, ఎవ్వరికి తెలీకుండా ఆవుల కొట్టంలోకి జారాడు. అక్కడ దూడకి ఒళ్లు నాకుతోంది తల్లి ఆవు. "నీకు కూడా అమ్మ ఉంది. కాని నాకు లేదు." అని దూడతో మొరపెట్టుకున్నాడు రాజు.

భారతి అడిగింది తల్లిని. "అమ్మా! రాజు కనిపించడేం? ప్రొద్దున్న ఒక్క నిమిషం చూశాను. వారం రోజుల్లో చాలా చిక్కిపోయినట్లున్నాడు. నన్ను చూడనందు చేతనో ఏమో. నువ్వొక్కసారైనా వాణ్ణి ఆసుపత్రికి తీసుకురాలేదేం?"

"నీకేంచాదస్తంగాని, వాడికే నీ మీద మమకారం ఉంటే ఇంతసేపటివరకూ నీ దగ్గరకు రాకుండానే ఉండేవాడటే?" తల్లి అడిగింది.

ఆ ప్రశ్నకు జావాబు తెలియలేదు భారతికి. ప్రొద్దున చూసినప్పుడు "అమ్మ దగ్గరకి రా, రాజూ" అని పిలిచింది. కాని రాజు ఆమెనొకసారి బిక్కగా చూసి, తలూపుతూ వెళ్ళిపోయాడు. రెండు మూడు సార్లు దూరం నుంచే ఆశ, ఆవేదన నిండిన చూపులతో చూశేసి, భారతి అటు తిరుగగానే పారిపోయాడు. ఇన్నిరోజులూ తన్నంటి పెట్టుకు తిరిగిన వాడిప్పుడిలా తప్పించుకు తిరగడం దేనికి?

ఈ చిక్కునెలా విడదీసేదా అని ఆలోచిస్తూ ఆ రాత్రి నిద్రరాక ప్రక్కలో ఇటూ అటూ పొర్లుతూ పడుకుంది భారతి. గడియారం పదకొండు కొట్టింది. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. పాపాయి ఉయ్యాల్లో నిద్రపోతోంది. ఏదో తీర్మానించుకుని లేచి కూర్చుంది భారతి.

సరిగ్గా ఆ సమయానికే గది తలుపు దగ్గరగా ఒక చిన్న రూపం వచ్చి నించుంది. భారతి ఆదుర్దాగా లైటు వెలిగించింది. గడపలో రాజు నించున్నాడు. అమాంతం వెళ్ళి వాణ్ణి కావలించుకుంది. రాజుకూడా అలాగే ఆదుర్దాతో తనగొంతు చుట్టేసుకుంటాడని ఎదురుచూసింది భారతి. కాని పిల్లాడు ఏవిధమైన భావమూ లేకుండా నించున్నాడు, వాడి పోయిన ముఖంతో. భారతి దిగులుతో రాజుముఖాన్ని దీక్షగా

చూసింది, ఏదైనా అంతు చిక్కుతుందేమోనని. రాజు కూడా ఆమెనే చూస్తున్నాడు.

"నువ్వు నా అమ్మవా, కావా?" అని అడిగాడు.

భారతి ఉలిక్కి పడింది. "ఏమిటి రాజా, అంటున్నావ్?"

"నువ్వు నా అసలు అమ్మవుకావని అమ్మమ్మ చెప్పింది. నిజమేనా...?" పిల్లాడి కళ్లలోని విచారాన్ని, ఆతురతని, భారతి కనుక్కొంది. వాణ్ణి మరింత గట్టిగా కావలించుకుంది.

"అమ్మమ్మ చెప్పిందా అట్లాగని? నేను లేనప్పుడు నిన్ను చాలా కష్టపెట్టిందా? ఆమె నూరికే వదిలిపెట్టను లే."

"నువ్వు నా అమ్మవా కావా? నేను అమ్మలేని వాణ్ణా?"

భారతి మనస్సు కరిగిపోయింది. కన్నీళ్లునిండి చూపును మందంచేశాయి. రాజు పాలబుగ్గలు ముద్దెట్టుకుంది.

"రాజా! నీ మనసుకు తోచడంలేదా నేను నీ అమ్మనని? నన్ను 'అమ్మా' అని పిలుస్తున్నప్పుడు నీ మనస్సులో ఆశా, ప్రేమా కలగడం లేదా?"

"కలుగుతూనే ఉంది. కాని నేను నీకడుపున పుట్టలేదని అమ్మమ్మ చెప్పిందే?" రాజు కనుబొమలు ముడిచి ఆలోచించాడు. "నాకూ నీకడుపున పుట్టినట్లు జ్ఞాపకం లేదే!"

"రాజా, అమ్మకడుపున పుట్టడం ఎవ్వరికీ జ్ఞాపకం ఉండదు. అమ్మమ్మ నాకు తల్లేగా. ఆమెకు నేనెప్పుడు పుట్టానో నాకూ జ్ఞాపకంలేదు. అయినా ఆమె నాకు తల్లేగా?"

"ఎవ్వరికీ జ్ఞాపకం ఉండదా? మరయితే 'ఈమె మన అమ్మ' అని అందరికీ ఎలా తెలుస్తుంది?"

తన హక్కును మళ్లీ స్థాపితం చేసుకోవాలనే ఆత్రం అతని ముఖంలో ప్రతిఫలించింది. అగాధ విచారంలో మునిగి పోయిన ఆపసి హృదయం శాంతికోసం పరితపించింది. ఆ శాంతిని రాజుకిచ్చేయాలనే భారతి కూడాకోరింది. కాని ఎలా? ఆలోచించింది భారతి తనకడుపున పుట్టని ఈ బిడ్డకు తనే తల్లినని నిరూపించి చూపాలిప్పుడు — ఆమె నిరూపణ ఆ లేత మనస్సుకి అర్థం కావాలె! తమలపాకుల ఎఱుపెక్కిన ఆమె పెదవుల్లో తల్లిప్రేమ చిరునవ్వుగా వెల్లివిరిసింది.

"రాజా, దేవుడున్నాడు కదూ?"

"ఉన్నాడు ......"

"ఆయనే ఒక్కొక్కళ్ల మనస్సుకు వాళ్లవా అమ్మ ఎవరని తెలుసుకోవడానికి దారి చూపిస్తాడు. అమ్మను చూడగానే బిడ్డల మనస్సులో 'ఈమె నా మీద ప్రేమగా ఉంటుంది' అని తోస్తుంది. ఏదైనా విచారం కలిగితే అమ్మతో చెప్పుకొని ఏడవాలనిపిస్తుంది. సంతోష సమయాల్లో ఆమెతో కలనవ్వాలనిపిస్తుంది. భయంగా ఉన్నప్పుడు అమ దగ్గిరకెళ్ళి కావలించుకొని ఒళ్లో కూచోవాలనిపిస్తుంది. అసలామెను చూడగానే 'అమ్మా' అని ఆశగా పిలవాలనిపిస్తుంది. నన్ను చూచినప్పుడు నీకిలాగంతే తోచడం లేదూ?"

"తోస్తుంది..." రాజు పెదిమలు ఆత్రంతో వణికి పోయాయి.

భారతి అందుకుందిమళ్లా. "ఎవరన్నా వీధి పొయ్యే వాళ్లను చూసి నువ్వు 'అమ్మా' అని పిలుస్తావా పిలవ్వు. వాళ్లుకూడా నిన్ను మనసునిండిన ప్రేమతో 'రాజా' అని పిలవరు. ఇది తెలీదూ నీకు?"

"తెలుసు. నాకైతే మరి నువ్వు నా అమ్మవ తోస్తోంది. కాని అమ్మమ్మే కాదని చెప్తోంది."

"అమ్మమ్మకేంలే. నాకు నీ మీద ఎంత ఆశో తెలుసుగా. నువ్వు క్రిందపడిపోతే నాకు నెప్పె తుంది. నువ్వు దుఃఖపడితే నాకు యేడుపొస్తుం అమ్మకు తప్ప మరెవరికైనా అలాతోస్తుందా?"

రాజు దుఃఖం కొంత తగ్గింది. ఆశతో భారతి దగ్గరకు జరిగి కూర్చున్నాడు, ఇంకా యేం చెప్తుందో వింటానికి. భారతి పిల్లాడి తల నిమురుతూ మాట్లాడింది.

"నువ్వు నన్ను చూశావు. నీ బుచ్చి హృదయంలో సంతోషం ఉప్పొంగింది. నన్ను 'అమ్మా' అని పిలిచావు. నేను చేతులు జాపాను. నువ్వు నా చేతుల్లోకి వాలిపోయావ్. మనం ఒకళ్లనొకళ్లు ఆశగా చూసుకొని నవ్వుకున్నాం. అప్పుడే 'నేను తల్లిని, నీవు కొడుకువూ' అని దేవుడు తెలియజెప్పేశాడు. ఇంకా నీకు సందేహం ఎందుకని?"



రాజు ఆమె నోటివంక చూస్తూ కూర్చున్నాడు. పిల్లాడి ముఖానదిగులు రేఖలు కొద్దికొద్దిగా తగ్గుతుంటంచూచి సంతోషించింది భారతి.

"ఇప్పుడు చెప్పురాజా, పిల్లలందరికి వాళ్ళ అమ్మ ఏమేం చేస్తుందని?"

రాజు చిన్నవ్రేళ్లు ముడుస్తూ లెక్కించ నారంభించాడు. "మొట్టమొదట అన్నం తినిపిస్తుంది. తర్వాత..."

"ఊఁ...తర్వాత...?" పిల్లాణ్ణి పురికొల్పింది భారతి, పట్టుకుచ్చులాంటివాడి వెంట్రుకలను వెనక్కి తోస్తూ...

"తర్వాత...? స్నానం చేయిస్తుంది. బట్టలు తొడుగుతుంది. నూనెరాసి తలదువ్వుతుంది. పాట పాడి నిద్రపుచ్చుతుంది. తర్వాత...తర్వాత......" "రాజు తామరపువ్వులా విచ్చిన ముఖంతో వరుసగా చెప్పుకొచ్చాడు. "తర్వాత...మరి...దగ్గరకి తీసుకొని ఒళ్లో కూచో బెట్టుకుంది. తియ్యగా బుజ్జగిస్తుంది. ముద్దు పెట్టుకుంటుంది. చూసి నవ్వుతుంది......"

తన మాటల్లోనే, మనసు నింతసేపూ అలయించిన ప్రశ్నకు జావాబు దొరికిపోయింది రాజుకి. చెప్పలేని ఆత్రంతో, ఆశతో భారతిముఖంవేపే చూస్తూ నించున్నాడు.

"ఇన్ని పనులలో నేను నీకు చేయనిదేది, రాజా?" భారతి ప్రేమ వొలికేమాటలు పిల్లవాడి మనస్సులో ఉన్న కొద్దిపాటి సందేహాన్నికూడా తుడిచివేశాయి. వాడి హృదయమూ, ముఖమూ వికసించాయి. దిగులూ, ఆ వేదనా ఎటుపోయాయో! ఇన్నిరోజులూ అనుభవించిన ఒంటరితనంగూడా మాయమయింది. క్రొత్తగా కలిగిన జ్ఞానోదయానికి కళ్లు జ్యోతుల్లా ప్రకాశించాయ్. మనసు కరిగిపోయి కళ్లునిండాయి. హృదయావేశాన్నంతా వెళ్లగ్రక్కే ధ్వనిలో "అమ్మా" అని అరుస్తూ భారతి మెడను చుట్టుకు పోయాడు తీగెలా.

"అమ్మా, అమ్మా, నువ్వు లేకుండా నాకేమీ నచ్చ లేదమ్మా. ఒకటే ఏడుపొచ్చింది. నా వాళ్లు ఎవ్వరూ ఈ లోకంలో లేనట్లనిపించింది. నువ్వు నా అమ్మవు కావని అమ్మమ్మ చెప్పినప్పుడు నాకెంత ఏడు పొచ్చిందో తెలుసా?" నాలుగురోజుల భయంకర అనుభవానికి పిదప దొరికిన ఈ ప్రశాంత సుఖం, ప్రశాంత శాంతి, పెద్ద ఏడుపుగా బయటికి పొక్కింది.

భారతి పిల్లాణ్ణి ప్రేమ పూర్వకంగా ఒళ్లోకి లాక్కుంది. తన కొంగుతో వాడి కన్నీళ్లు తుడిచింది. రాజా ఆమె రొమ్మున ముఖం దాచుకొని కదలకుండా కూర్చున్నాడు కాసేపు.

"ఇప్పుడు తెలిసిందా రాజాబాబూ! ప్రేమ చూపించేఆమే తల్లి. నేను నీతల్లిని, అమ్మను."

ఉయ్యాల్లో పాపాయి కదిలాడు. - రాజా అప్పుడే మొదటిసారిగా గమనించాడు పాపని. ఏదో చిత్ర మైన వస్తువును చూచినట్లు చూస్తూ కూర్చున్నాడు.

"వాడే నీ తమ్ముడు పోయి-తాకిచూడు."

రాజు మెల్లగా లేచి మాటిమాటికి భారతిని తిరిగి చూస్తూ ఉయ్యాలదగ్గరకు వెళ్ళి మెల్లగా తాకిచూశాడు పాపని. ఆమెత్తని స్పర్శకు వాడి ఒళ్లు పులకరించింది. గబగబా భారతి దగ్గరకు పరుగెత్తుకువచ్చి ఆమె తనని కంటినటు నిండుని ఓరకంటితో పాపాయేం చేస్తున్నాడోనని చూశాడు.

"తమ్ముడికి ఏం పేరు పెట్టాలి. ఏంపేరు పెడదాం చెప్పు?" భారతి అడిగింది.

"చెప్పనా — శేఖర్ అని పెట్టాలి." అన్నాడు రాజు ముద్దుముద్దుగా. భారతి పొంగిపోయే ప్రేమతో పిల్లాణ్ణి లాగి ముద్దెట్టుకుంది. తల్లి, బిడ్డలు ప్రేమలో ఐక్యమై లోకాన్నే మరిచిపోయారు.

మాటలసందడికి లేచివచ్చి, కిటికీదగ్గర మరుగున నించొని ఇంతసేపూ చూస్తుండిన జానకమ్మ కళ్లు తుడుచుకుంటూ చప్పుడుకాకుండా తిరిగి వెళ్ళి పోయింది తనగదిలోకి.

# నా కిప్పుడే దీపావళి

కుమారి నిరుపమ గురుకుల్

''పండుగకు పోలేదా బ్రదర్ ! దర్జాగా సెకిలుతీసియిచ్చే వారేగా ?'' రామం నవ్వుతూ అడుగుతూ ప్రవేసించేసరికి ఏదో ఇంగ్లీషు నవల చదువుకొంటున్న రాజు వులిక్కిపడ్డాడు. కానీ రామం వేసిన ప్రశ్నను గురించి రాజు ముహం నల్లపడి పోయింది. స్నేహితునిలోని మార్పును కని పెట్టిన రామం నవ్వడం ఆపి బుద్ధిమంతు నిలా కూర్చున్నాడు.

రాజు తిరిగీ పుస్తకంలో లీనమయ్యాడు. రామం దీర్ఘనిట్టూర్పు వదిలాడు. ఎందుకో అప్పుడేలేచి ''వస్తారా – బ్రదర్ ! నీకో శుభవర్తమానం చెప్పిపోదామని వచ్చాను. దీపావళి రోజున్నే మూర్తీరావు మా సరళని చూడ్డాని కొస్తారుట. నీవుగానీ మద్రాసు వెళ్ళకుండావుంటే ఆ రోజు నీవు వస్తావా ? సరీగ్గా ఆ రోజే నేను మద్రాసు నుండీ వస్తాను తిరిగి'' అన్నాడు.

''ఓ ! నీవు మద్రాసు పోతున్నావా ?'' అని మాత్రం అన్నాడు రాజు తలతిప్ప కుండానే.

''అవును. వస్తారా !'' అని రామం వెళ్ళిపోయిన తర్వాత రాజు విసుగ్గా పుస్తకాన్ని నేలకేసి కొట్టాడు. బరువుగా తల వాల్చి పడుకొన్నాడు. రాజు కండ్లకి సంవత్సరపు క్రితం విషయాలు సినిమా బొమ్మలలా కనపడడం మొదలు పెట్టినవి.

'అబ్బ ! ఎంత చెడ్డరోజులు ! విమల– ఆ కురూపి తన భార్య ! తను అగ్ని సాక్షిగా తాళికట్టాడా ? అబద్ధమా ? అబద్ధమయితే ఎంత బాగుండు! రాధనెలా మర్చిపోవడం ? ఆ పిల్లనే పెళ్లాడాలని ఎంతో ఆశపడ్డాడు తాను ! రాధ ఎక్కడ? విమలెక్కడ? రాధ కాలిగోరి అందమైనా లేని ఆ కురూపికి తన్ను విధి ఎట్లా భర్తను చేసాడు ? నిజంగానే జరిగిందా పెళ్లి ? అబ్బ ! ఎంత దారుణమైన సంఘటన అది! ఎట్లా భరించడం ? జీవితంలో విమలతో ఎదురైతే రాధకు ''అంతకన్నా అవమానం ఏముంది ? పాపం ! ఎక్కడుందో గదా! పెళ్లి అయిందో – లేదో ? తనకు మాత్రం ఆ కురూపితో పెళ్ళయిపోయింది! దీపావళి పండగకట ! పోవాలట తాను! ఛీ! అమ్మకి తగ్గ శాంతి చెయ్యాలి. చక్కగా ఆ రోజు రామం ఇంటికెళ్ళి కూర్చుంటాను. పాపం సరళకూడా ఎంతో బావుంది. కళ్లులేనివిధి ఒకవేళ మూర్తితో ఆ పిల్ల

పెళ్ళి రాసాడేమో! ఏమిటీ దాంపత్య జోళ్లు!"

♦ ♦ ♦

"ఎప్పుడు పోతావురా? రాత్రిబండికా?"

రాజు వులిక్కిపడిలేచాడు. అమ్మ గొంతు! దీపావళికి పొమ్మని హుకుం కాబోలు!

"ఏమిట్రా? పెట్టెబేడా సర్దుకోలా?"

రాజు ముఖం ఎఱ్ఱపడ్డది. కన్నతల్లి కాకపోతేనా - ఇహ తాను నోరు తెరిస్తే చాలు. ఏం మాటలు వస్తాయో తనకు తెలీదు. తర్వాత ఆమె ఏడుస్తూ కూర్చుంటుంది.

"త్వరగా తెములు!"

రాజు మాట్లాడలేదు. రత్నమ్మగొంతు ఆ తర్వాత వినరాలేదు. అమ్మని తల్చుకొంటేకూడా రాజు ఎంతో ఇదయిపోతాడు. ఇప్పుడు నాన్నారు లేరుకానీ "ఆ భయంకరమైన స్వరూపాన్ని అమ్మ ఎలా వరించిందో? ఇద్దర్ని ఎలాకందో? రాజుకంతా విచిత్రంగానేవుంది! ఏమిటీ జోళ్లు?

౨

"మొత్తానికి నీవు పోలేదన్నమాట! నీ వరస నాకేమాత్రం బాగలేదురా!"

"అదిసరేగానీ - మూర్తి కివ్వడం ఖాయమేనా సరళను?"

"ఏం? మూర్తి నీ దృష్టిలో అందగాడు కాదనా?"

"నా దృష్టివరకూవద్దు, నీ దృష్టిలో చెప్పు! సరళ కన్యాయం చేస్తున్నావురా! మరి."

"ఇందులో నా పాత్ర ఏదీలేదురా. అంతా సరళ, వాళ్లవదిన, అమ్మ ఇష్టమే అంతా."

"నాకేమో అసంతృప్తిగావుంది" రాజు తిన్నగా అన్నాడు.

"మనదేం సినిమా ' జీవితమటరా! అంజలి, నాగేశ్వరరావు, సావిత్రి, రామారావు అని అందంగా హీరో, హీరోయిన్‌లలా జత కుదర్చడానికేని! అంజలి భర్త ఎలాగున్నాడో, నాగేశ్వరరావు భార్య ఎలాగుందో నీవు చూసావా?"

"నీతో మాట్లాడడం నాచేతకాదురా" విసుగ్గా అన్నాడు రాజు.

రామం నవ్వాడు. ఇంతలో మేళంతో పిలుపువారు రావడంతో రాజు కిటికీ దగ్గరగా నిలపడ్డాడు. "ఇంకెవ్వరు! అహా! రాధ! రాధ!" రామం తల్లితో వస్తూవుంది. సరళ పెళ్లిపిలుపుకుకదా•రావడం వీళ్లు!

రామం రాజు చేష్టలని కనిపెట్టక పోలేదు. "అన్నట్లు! ఆ అమ్మాయే నీ చెల్లెలురా! ఓ రాధ ఇలారా! ఇతనే తరళ అన్నగారు. మీ స్నేహితురాలు విమల భర్త అయిన రాజారావు" అని భార్యను పిలిచి పరిచయంచేసాడు. రాధ మొదట వులిక్కిపడ్డది. ఎలాగో "నమస్తే" అని మాత్రం అనగలిగాడు రాజు. రాధ నవ్వుతూ "నమస్తే" అన్నది.

రాజు చిత్తరువులా నిలపడిపోయాడు! ఓరి కళ్ళులేని విధీ! రామం పెళ్ళామా రాధ!!!

## 3

"ఏమన్నయ్యా! విమల నింకా పిల్చుకొనిరాలేదా!" అని ఎంతో చనువుగా అడిగింది రాధ పెళ్లికొచ్చిన రాజును. రాధ ఎంతో ఉత్సాహంగా తిరుగుతుంది చిలకల్లే. రామం ఎంతో అభిమానంగా పిలుస్తున్నాడు. రాధ అక్కడివారితో అప్యాయంగా బదులు చెప్పతూంది. తానొక కురూపికి భార్య అయిపోయినందుకు ఆ పిల్ల చిన్న శెనగ్గింజంతకూడా క్రుంగిపోయినట్లులేదు. ఔరా!

ఎలాగో తీరిక చూచుకొని రాజు అన్నాడు "రాధా! నీవేనా రాధవి?"

"అవును. నీవు మాత్రం మునుపటి రాజువికావు."

"రాధా! నన్ను కొన్ని విషయాలు నిలువునాక్రృంగతీస్తున్నవి.నీవు...నీవు..."

"చాలు! ఆపు-రాజూ! ఎవ రేనా విన గలరు. ఎప్పుడో ప్రేమించుకొన్నాం, అయింది - పోయింది. ఇప్పుడిద్దరం వివాహితులం. నీవు నన్ను తల్చుకుంటూ, నేను నిన్ను తల్చుకొంటూ, ఇటూ నా భర్తను, అటూ నీ భార్యని క్రృంగతీయడంతప్ప ఇంకేంలేదు. మనకా ధైర్యంలేదు- పాడులేదు. పెద్దవాళ్లని ఎదిరించలేము. తర్వాత మాత్రం క్రుంగిపోవడం చేత అవును. కానీ అది నాకు చేతకాలేదు. నీ భార్యను కాకపోయినా నీ మిత్రుని భార్య నయినందుకు సంతోషపడు! నిన్ను విమల భర్తగా పొందినందుకు నాకెంతో ఆనందంగావుంది. విమలను సుఖపెట్టు!"

రాజు దిమ్మతిరిగిపోయాడు. రాధ తర్వాత అగపడలేదు. రాజు మనసు ఒక్కసారి ప్రశాంతమయి పోయింది. పాపం! విమల ఏమనుకొందో - తాను దీపావళికి రాలేదని! ఎంతగా క్రృంగిపోయిందో? తాను మనస్ఫూర్తిగా ప్రేమించిన రాధ! రాధ ఎంతగా మారిపోయింది! అవును. రాధ అన్నట్లు పెద్దలను ఎదిరించడానికి తనకెన్ని గుండెలున్నవి? రాధ జాతకం బాగలేదని పెద్దలు అంటే తానేం చేసాడు? వాదించి బాగలేకపోయినా పెళ్లాడి తీరుతానని

ముందడుగు వేసాడా ? లేదు ! మరునాడు అనుకోని విధంగా కొడుకు అత్తగారింటికి పయనమయిపోతుంటే రత్నమ్మ కండ్ల నుండి ఆనందభాష్పాలు నాలుగురాల్చింది!

“దీపావళికి అల్లుడొచ్చాడు” అని మరదలు హాస్యంచేసింది రాజును.

“నాకిప్పుడే దీపావళి” అన్నా నవ్వుతూ విమలని చూస్తూ రా కొంటెగా !

జన్మదిన సందర్భమున ప్రపంచమంతా ఆరాధించిన



పూజ్య బాపూజీ

# మానవజీవితంలో కళలకుగల స్థానము

శ్రీమతి పాతూరి విశాలక్ష్మమ్మ

మానవ జీవితానికి కళకుగల సంబంధము అవినాభావమైనట్టిది. కళలు 64. అందులో నృత్యం, సంగీతం, చిత్రలేఖనము, శిల్పము, పాకకళ లాంటి వానికి మానవ నిత్యజీవితముపై గల ప్రభావము విశేషమైనది. కళయనగా విద్యలోని తేజస్సు. విద్యయనగా ఒక్క చదువు సధ్యలు మాత్రము కావు. మానవ జీవయాత్రలో భుక్తికి, రక్తికి, ముక్తికి ఉపకరించి పురోభివృద్ధికి దోహదమిచ్చేది ప్రతిదీ విద్యయనే చెప్పవచ్చును.

కళాకాంతులులేని మానవజీవితము నిర్వీర్యమైనట్టిది. కాబట్టే కళారాధన, కళాపిపాస ప్రజా జీవితంలో తేజోవంతమైన అభ్యుదయ పరంపరలను సమకూరుస్తవి.

అరువదినాల్గు కళలలోను స్త్రీ పురుషుల ఆరాధనాను సరణకు యోగ్యములు — చిత్రకళ, శిల్పకళ, గానకళ, నృత్యకళలు. కాని పాకకళ, నృత్యకళ, చిత్రకళలు మహిళలచేతుల్లో అమోఘంగా రాణిస్తవి. గానకళ, నృత్యకళలు భుక్తి, రక్తితోపాటు ముక్తిని ప్రాసాదించేవి కాబట్టి వానిని నిత్యజీవితంలో ఆరాధించి అలవరచుకోని వ్యక్తిలో మానవత్వము లోపించి యుంటుందనవచ్చును.

'రవి కాననిది కవి ఎట్లు తెలుసుకొనునో' శిల్పి,చిత్రకారుడూ కూడ అట్టివారే. ప్రకృతిలోని రామణీయకతను చిత్రించుటలో కవి, శిల్పి, చిత్రకారుడు చేసే కృషి అమోఘమైనది. ఇవి విశేషంగా ధనార్జనకు అమలులోనున్నా ప్రజలజీవితంలో హత్తుకొనిపోవడం అత్యవసరం. ఆనాడేకాని పిపాస, ఆరాధనలతో బాటు కళాపోషణ సయితం జరుగనేరదు.

కుటుంబజీవనము సుగమంచేయడానికి స్త్రీలు, పురుషులు కళాకారులు కావాలి. అవకాశములు, చాకచక్యమునుబట్టి కళలను భుక్తికొరకు వినియోగించుకోవచ్చును. ముఖ్యంగా స్త్రీలు గృహపరిశ్రములు - లేసు ల్లల్లడం, దుస్తులు కుట్టడం, చాపలు, బుట్టలు, విసనకర్రలు అల్లడం, నూలువడికి గుడ్డలు నేయడం, - సంగీతం, నృత్యము, చిత్రలేఖనము, శిల్పములతో బాటు నిర్వహించవగును.

ఈ కళలపట్ల అభిరుచిని పెంచి ప్రజోపయుక్తంగా చేయడానికి విద్యాలయాలు సయితం కేంద్రాలు కావాలి. విద్యార్థుల అభిరుచులననుసరించి కళలను వారికి నేర్పడానికి, ప్రజలలో కళాపిపాసను విస్తరింపచేయడానికి కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు విశేషంగా తోడ్పడాలి.

## శతకవాఙ్మయానుబంధము - త్రి

# శ్రీ లక్ష్మీశారదలు

# కుమారీనీతి

పండిత వేదము వేంకట కృష్ణశర్మ

ఈ "శ్రీలక్ష్మీశారదలు, జంటకవయిత్రీమణులుగఁ దోఁచుచున్నారు. కాని, 'తొలిపలుకు'-రచించినవారీశతకము మొదటి యామెయగు 'శ్రీలక్ష్మీకాంతమ్మ' కర్తృకమనియే సూచించిరి.

మఱి యభిప్రాయము లీకృతిపయి నిచ్చినవారలలో నొకరు:- "ఇక్కలి లక్ష్మీశారదలు నింపగుతావుల గీతసాహితీదృక్కులఁ బల్కు నాదములఁ దీయని తేటలఁ గూర్చినార లీస్రుక్కని వాడిపోవని ప్రసూనపథమ్ము" — అనియు, వేఱొకరు:- నీతులన్ విదితముగాఁగఁ జెప్పి కృతిపెట్టిరి వీరివలెం దలంపఁగా, సదమలపుణ్యకాంత లిల శారదమున్ మఱి లక్ష్మీకాంతమున్"- అనియు,- నిది కవయిత్రీ-ద్వయ విరచితముగాఁ దెలిపిరి.

శ్రీ లక్ష్మీకాంతమ్మగూడఁ దన విజ్ఞప్తిలో:- "తక్కిన యన్నిగ్రంథరచనములందువలె నిందును నాకు చేదోడు వాదోడగు శ్రీమతి మాశారదాంబకు నాకృతజ్ఞతాభినందనములు" — అని వ్రాసినారు.

వీనింబట్టి పరిశీలించుచో — నిక్కముగ శ్రీగిడుగు లక్ష్మీకాంతమ్మయే శతకరచయిత యనియు, రెండవ యామెయగు శ్రీజొన్నలగడ్డ శారదాంబ, ఆమెకుఁ గేవలము సహాయభూతురాలుమాత్రమే, యనియు - ద్యోతకమగుచున్నది. కాన, నీగ్రంథమున 'శ్రీశారదాంబ' ప్రశస్తి, మహాభారతాంధ్రీకరణమున నన్నయభట్టారకునికిఁ దోడ్పడిన నారాయణభట్టు ప్రశస్తి వంటిది అస్తు.

శ్రీ లక్ష్మీకాంతమ్మ, మనరాజధానిలోఁ జిరకాలము విద్యాశాఖయందు "డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు" పదవియందుండి విశ్రాంతిఁ గైకొన్న తరువాత, బాపట్లయందు వసించిన బ్రహ్మశ్రీ గిడుగు వేంకటరామమూర్తిపంతులవారి * ధర్మపత్ని-యని, శ్రీ - గో. రమాకాంతాచార్యులు తెలిపిరి. శ్రీలక్ష్మీకాంతమ్మయు - "నాకు విద్యాబుద్ధుల నేర్పుచు నిట్టి గ్రంథముల రచించునెడ, నాకు గురువులుగను, ప్రోత్సాహకులుగను నుండుటయే గాక, మా కూతులకీధర్మమార్గములఁ బ్రబోధించుటయందు నాకు తోడును, నాభర్తగారును అగు శ్రీ "గిడుగు వెంకటరామమూర్తిపంతులుగారికి నా నమస్కారములు"- అని వాకొనెను.

ఈ శ్రీగిడుగు వేంకటరామమూర్తి పంతులు 1940 సం|| ప్రాంతమున ఉద్యోగ విరమణముగాంచినట్లు 'తొలిపలుకు' వలన నూహింపఁదగియున్నది. శతకము 1943 సం||న ముద్రణమయినది. అప్పటికి శ్రీరామమూర్తి పంతులుగారికి దాదాపు 57-58 యేండ్లయిన నుండవలెను. ఆతని ధర్మపత్నియగు శ్రీలక్ష్మీకాంతమ్మ, భర్తకంటె పది సంవత్సరములు చిన్నదిగ నుండవచ్చు ననుకొన్నచో, నేఁబదియేండ్లకు దరిదాపుగ నామె ప్రాయ ముండియుండును. అపత్తుమున నామెజననము క్రీ. శ. 1895 ప్రాంతమగును.

ఈ 'కుమారీనీతి' - యనుకృతిలో సరిగా వంద పద్యములున్నవి. వానిలోఁ జాలవఱకుఁ జంపకోత్పల

* ఈ శ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారును, వ్యావహారికభాషావాదులుగఁ బ్రఖ్యాతిగన్న వేంకటరామమూర్తిగారును భిన్నులని యెఱుంగునది.

వృత్తములు, తేటగీతికలు ఆటవెలఁదులు అరుదు గాఁగనిపించుచున్నవి. మకుటనియమము లేకున్నను, బెక్కువృత్తములకుఁ జివర "పుత్రికా" - "అమ్మరో" - "తల్లిరో"—అని సంబుద్ధులు ప్రయోగింపఁబడినవి. - 'తొలిపలుకులో' జెప్పఁబడినట్లు :- "శైలి నాతికఠినమై, లలితపదసంఘటితమై, ధారాశుద్ధిగల్గి జాతీయములతో మొల్లమై విరాజిల్లుచున్నది."

ఈ క్రిందివి కొన్ని జాతీయములు:—

1. కాంతల మేలుబంతి, 2. పెదవిన్విఱుచు, 3. కొంగుపసిండి, 4. పున్నెపుఁబంట, 5. కడచిగట్టెక్కు.

కొన్ని సాంస్కృతికోక్తులు:—

1. ఆత్మవత్సర్వభూతాని, 2. అతిథిదేవోభవ, 3. అభ్యాగతస్స్వయంవిష్ణుః.

లోకోక్తులు కొన్ని:—

1. పాలునునీరువోలెఁ బతిభావములోన మెలంగు.
2. చెట్టయివంగకున్న, నది చేవగు మ్రానయి వంగఁగల్గునే?
3. ఈతకు లోఁతు లేదు, జగదీశుని చెయ్యికు లాతి లేదు.
4. తాడిక్రింద, రమణీమణి! పాలను ద్రావినఁ గుణోదారులుగూడఁ గల్లనరె?
5. భయమున నేరినేనియును బాలను ద్రావఁగఁ జేయనేర్తుమే?
6. నయమున నెంతవారికయినన్ విషమీయఁగవచ్చుఁగాదె?
7. ఫలయుతమౌ కుజమ్మునెడఁ బల్వురు రాళ్లను రువ్వుచుండినన్ ఫలముల, నీయమానదు.
8. కడువడి నేలుదాఁటి తనకార్యము దీఱఁగఁ దెప్పఁ గాల్పఁగాఁ గడఁగినయట్లు.

అందందు లక్షణవిరుద్ధములగు సమాసాదులున్నగునవి యీ శతకమునఁ గానవచ్చెడు:—

1. విద్యాకళ్మి, 2. క్షమశీలంబు, 3. శ్వశురవిభులు, 4. అత్రసమావృతము, 5. అకల్మికిఁ జింతిలకు, 6. దరిశనము.

ఇందు కొన్ని పద్యములు, సంస్కృత శ్లోకభావముల కనుకరణములు:—

1. "కార్యేషు దాసీ కరణేషు మంత్రీ"— అను శ్లోకమునకు:—

"అన్నము బెట్టువేళఁ బతి
నమ్మరో! చూడుమ మాతవోలె, సం
పన్నతఁ గార్యతంత్రముల
భాసిలు మమ్మరో! మంత్రివోలె, భా
గ్యోన్నతులొందినన్ సతము
నుత్సవమందఁగఁ బ్రాణమిచ్చి, సౌ
ఖ్యోన్నత సాంప్రదాయమున
నుండుమ శయ్యను రంభపోలికన్"

2. "పితా రక్షతి కౌమారే, భర్తా రక్షతి యౌవనే" — యను శ్లోకమునకు:—

"పసితనమందుఁ దండ్రికిని,
భాసుర యౌవనమందు భర్తకున్

ముసలితనంబునందు నిజ
పుత్రులకుఁ వశవర్తి యౌచు, సం
తసమున స్త్రీ మెలంగుటది
ధర్మము యుక్తము శ్రేయదంబు, లా
యసమ సుధీమతమ్మ నగు
నార్షపథమ్మున సంచరింపుమా!''

ఈ క్రిందివి వచ్చునవి మఱికొన్ని పద్యములు —

''పరులను దూఱకమ్మ, పర
భామల గేలియొనర్పకమ్మ, యి
ద్ధరపయి ధర్మమార్గమును
దప్పకుమమ్మ, సమస్త జీవులన్
గరుణ దలిర్పఁ గాంచి, సరి
కాంతలలోపల మేలుబంతివై
వరలుచు నిత్యకృత్యములఁ
బాయక వర్తిలుమమ్మ పుత్రికా''

''చందన గంధ బంధుర వి
శాల వినిర్మల శుభ్రగాత్రివై,
మంద మనోజ్ఞమౌ గతుల
మన్ననలం బొలుపొంది మోమునన్
జిందులు ద్రొక్క లేనగవు
శ్రీ కరలీలలఁ దల్లి!, నిత్య మా
నందముఁ గూర్పుమా, పతికి
నవ్యగుణోన్నత భావసంపదన్''

''కోపము, గర్వమున్, భయముఁ,
గూళలచెల్మి, పరాకు, నాత్మసం
తాపము, లోభ, మీర్ష్యయును,
దానె కరంబు నుతించుకొంట, నిం
దాపరమైన భాషణముఁ,
దప్పులటంచుఁ దలంచి యాత్మ నీ
కాపురమెల్ల దిద్దికొనఁ
గల్గెదు దక్షతఁ గాంచు మమ్మరో''

''పతి నెడఁబాసి యుండుటలు
భామలకుం దగదెప్డుఁ, గావునన్
బతియె నిధానమంచు నెద
భావనఁజేసి ముదమ్ముతోడ, స
త్పతి యన నీవయంచుఁ బ్రజ
సంస్తుతిఁజేయ జగంబులోపలన్
సతతము కాలముం గడపి
సద్యశమున్ గొనుమమ్మ, తల్లిరో!''

''పతి నీపైఁ గోపించిన
మతిచెడి కంపించువేళ మాటాడకుమా,
సతి కిల శాంతమె భూషణ
మతులశుభోదయ సుమార్గ మదియే తల్లీ!''

''మాటకంటె మిగుల మనసె దిట్టమనుచుఁ
బూజకంటె మహిమ బుద్ధి యనుచుఁ
గులముకన్న గొప్పగుణమటంచాత్మను
దలఁచి మసలుకొమ్మ ధవునితోడ''

''కలలయందైన ననృతంబుఁ బలుకరాదు
ధర్మగుణ మెన్నఁడైనను దప్పరాదు,
పరుషవాక్యంబు బల్కంగఁ బాడిగాదు,
భారమైనను నాడి తప్పంగరాదు''

''పూతవీరాంగనల కీర్తిఁ బోలి సతము
దేశసౌభాగ్యగరిమ సుధీరవృత్తిఁ

గనులఁ గాపాడుచుండు మా, కనుఁలదెఱచి
భరతమాతకుఁ బుత్రివై పరగుకతన''

ఈ శతకరచనమునకుఁ గారణము:— తనకుఁగల యేడుగురు కుమార్తెలను వారి యత్తవారిండ్లకుఁ బంపుచో, నీ రీతి నీతులను బద్యరూపమునఁ జెప్పిన, వారికివి మనస్సునకెక్కి శాశ్వతముగ నుండునను కవయిత్రీ రత్నముయొక్క దృఢవిశ్వాసమగుటయే. ఇది శ్రీ లక్ష్మీకాంతమ్మరే, తన విజ్ఞప్తిలోఁ దెలిపినది.

——•——

"డాక్టర్‌గారూ! మాచిన్నబ్బాయి నాఫౌంటెన్ కలమును మ్రింగేశాడు - మీరు ఒకసారి వెంబడే మాయింటికి బయలుదేరి రావాలి"

"అలాగా - యిప్పుడేవస్తున్నాను - యీలోగా మీరేమిచేశారు?"

"కలంలేకపోగా పెన్సిలుతో వ్రాతముగించాను"

♦ ♦ ♦

తన టేబిలుప్రక్కన కూర్చొనియున్న లేడీ టైపిస్టుతో యజమాని "నీవుచాలా అందమైన పిల్లవుసుమా"

ఫంకోచిస్తూ టైపిస్టు "నిజంగానాండీ"

"నీవు చక్కని దుస్తులు ధరిస్తావు; చక్కగా మాట్లాడుతావు; దానికి తగిందే నీవు చేస్తున్న ఉద్యోగంకూడాను"

"క్షమించండి! మీరు నన్ను యింతగా పొగడడంబాగలేదు"

"అదా - ఆఫీసు పని చేసేముందు నీకు విసుగూ, శ్రమ అనిపించకుండా ఉత్సాహంగా నుండేదానికి అంటున్నమాటలు"

♦ ♦ ♦

"బాబూ! నీవు స్నానం చెయ్యలేదని అమ్మ ఎలాగ కనుక్కోకలిగింది.

"సబ్బును తడిచెయ్యడం మరచాను అక్కా"

♦ ♦ ♦

ఒక ఉపాధ్యాయుడు "రాజూ! 1904 సంవత్సరములో పుట్టిన వ్యక్తికిప్పుడు ఎన్ని సంవత్సరాల వయసుంటుందిరా"

"స్త్రీకా, పురుషుడికాండీ!"

'వారపీచు'

# అ మ ర గా న ము

శ్రీ చింతగుంట సుబ్బారావు



చల్లని పిల్ల తెమ్మెరలఁ స్వాంతన మూయల లూఁగసాఁగ నా
పల్లె తటాకపుండరిఁ నపార ముదంబు మదంబు గూర్పఁగాఁ
నుల్లముఁ గొల్లగొంచుఁ శ్రవణోల్లసమై పరఁగెన్ మనంబునన్
మల్లియ మాల లూఁగఁ ననుపం బమరంబగు గానమొండహో!

కాంచుడు కాంచు డల్లదిగొ గానముఁ సేయుచునుండెఁ నొంటిమై
చంచలనేత్రిదాఁ నెవరొ సాచికరంబుఁ పసిండి పంటలన్
ద్రెంచుచుఁ తన్నగం బుబుకఁ ధేనియలొల్కు గళంబునందెదో ;
చంచల భావనల్ సడలెఁ, స్వాంత మచంచలమయ్యె నత్తరిన్.

చేతనత్వ ముడిగి చేరువఁ నిలచితిఁ–మంత్రముగ్ధసర్ప మాత్రుఁడనయి ;
ఎరుఁగకున్నఁ భాషఁనేమాయెఁ నెద్దియో ?–తరుగకున్కి రసముక్షరఁగె మనము.

పాయకనిల్చెఁ నాధ్వమదిఁ పావనగాన మదెల్ల వేళలన్
ఛాయయుఁబోలెఁ నొప్పఁ రసస్రావమునన్ ననుఁ ముంచియెత్తుచున్
హేయముగాదు జీవమిది, హీనముగాదు సుమా నిజంబుగాన్
కాయము ; జీవితంబు కళగాదె ? సుఖంబనఁ వేఱయున్నదే ! ?

[వర్డ్స్‌వర్త్ రచించిన 'సాలిటరీ రీపర్', నాధారముగా]



# దీనికి బాధ్యులు ఎవరు?

శ్రీ సి. సి. పున్నయ్య

చల్లబడుతున్న సాయంకాల సమయం. ప్రచండ భానుడు ప్రసన్నుడయ్యాడా అన్నట్లు మెల్ల మెల్లగా పశ్చిమాద్రిలో క్రుంకుతున్నాడు. బాధ్యతలన్నా, కష్టాలన్నా తెలియని బాల బాలికలు ఉత్సాహాతిశయంతో ఆడుకుంటున్నారు. ఆలమందలు పొలాల నుండి స్వస్థానాలకు తరలి వస్తూంటే దూడలు మోర లెత్తి అరుస్తూ స్వాగత మిస్తున్నవి. నిరాశా నిస్పృహలకు గురియయిన మానవులు సయితము విశ్రాంతి, పునర్జీవం కొరకు గుట్టలు గుట్టలుగా ఉద్యానవనాల్లో, నిర్జన ప్రదేశాలలోకి చేరుకొంటున్నారు. కార్ఖానాలలోను, కార్యాలయాలలోను పనిచేస్తున్న కార్మికులు, గుమాస్తాలు గంట కొట్టంగానే గొర్లమందల లాగ ఎవరి యిండ్లకు వాళ్లు బయలుదేరుతున్నారు.

ఆ కార్యాలయంలో ఆ టేబులు దగ్గర పని ఎప్పుడూ తరగదు. రాత్రీ పగలూ అనే విచక్షణ అసలేలేదు. కట్టలు కట్టలుగా కాగితాలు ఎప్పుడూ ఆ బక్కపీచు గుమాస్తా దృష్టికి వస్తూనే యుంటవి. ఏంచేస్తాడు పాపం? ఎంతచేసినా పని పెరుగుతూనే

యుంటుండె! అలాగే నెలలు, సంవత్సరాలు గడిచి పోతున్నవి. ఆ రోజున ఎందుకో ఆఫీసు కాగితాలు చూస్తూ చూస్తూ గడియారంవైపు చూచాడు. "అప్పుడే ఆరుగంటలు కాబోతున్నదే" అనుకుంటూ టేబిలుమీద కాగితాలుసర్ది యింటికి బయలుదేరి వెళ్లాడు. దారిలో తాను సినిమాకు వెళ్దామని చెప్పివచ్చి, యింటికి ఆలస్యంగాపోవడంవలన శాంతకు కలిగిన ఆశాభంగాన్ని ఊహించుకుంటూ యిల్లు చేరాడు. సాధారణంగా తాను ఆఫీసునుండి రావడం చూచి గడపల్లోకే చిరునవ్వుతో ఎదురొచ్చి కోటు, బూట్లువిప్పే శాంతజాడ ఆ రోజున కనబడకపోవడం అతనికి కొంత ఆందోళన కలిగించింది.

"ఏమిటో కారణం ... ..." అనుకుంటూ హాలులోని సోఫాలో కూలబడి బూట్సులువిప్పి మెల్లగా మేడమీదికి వెళ్లాడు. అక్కడా శాంత కనుపించక నలువైపులా చూచాడు; రెండుసార్లు పిలిచాడు. అతని ఒంటరితనాన్ని గదిలోని కుర్చీలు, పటాలు హేళనచేస్తున్నట్లనిపించినవి. తన గత ఆరు నెలల వైవాహిక జీవితపు మధురస్మృతులు, యిప్పటి ఏకాకి జీవితము మనసును కలచివేస్తున్నవి. ఆరు నెలల కాలంలో శాంత తన కనుసన్నలలో మెలగిందికదా — మరి యీనాడు— యిప్పుడు — ఏదీ — తాను ఆఫీసులోచేసే శ్రమనంతా మరపించే శాంత మందహాసం — గ్లాసునిండా కాఫీ ఏవీ?

శాంత, శేఖర్‌ల అనురాగ దాంపత్యాన్నిచూచి ఆదర్శనీయమయిందని కొందరనుకుంటుంటే మరి కొందరికి కళ్లుకుట్టినవి. కొందరికేమిటి - శేఖర్ తల్లే వాళ్ళిద్దరినిచూచి మూతి, ముక్కు విరుస్తూ "ఎప్పుడూ పెళ్లాన్ని చూచుకుంటూ మొగుడు, మొగుడుని చూచుకుంటూ పెళ్ళాము కూర్చుంటే యింట్లో చాకిరి ఎవరు చేస్తారు" అని రుసరుసలాడుతుండేది. వాస్తవానికి శాంత చాలనెమ్మదయింది. పనిపాటలలోఎప్పుడూతప్పించుకు తిరుగాలని చూచేదికాదు. అయినా అత్తగారి రుసరుసలకు అంతుండేదికాదు. తల్లి రాకాసి తనానికి వెరచి శేఖర్ చూచీ చూడనట్లు, వినీ విననట్లు ఆడంగుల గొడవలలో జోక్యం కలిగించుకోకుండా యుండేవాడు. బహుశా యింట్లో అత్త కోడండ్రమధ్య ఏదో గొడవ జరిగియుంటుందని అనుకుంటుండగానే శాంత కాఫీగ్లాసు పుచ్చుకొని వచ్చింది. కాఫీగ్లాసు అందుకుంటూ శేఖర్ "ఏమిటి శాంతా! అలాగున్నావు - ఆ రేగిన వెంట్రుకలేమిటి? - ఎందుకు కళ్లు ఎఱ్ఱబడి యున్నవి" అని అడిగాడు.

శాంత తలవంచుకొని ఏమిమాట్లాడలేదు.

"ఏం వళ్లు బాగలేదా - డాక్టరును పిలుచుకొని వచ్చేదా" అని అడిగాడు.

శాంత కళ్లలో నీళ్లు గిర్రున తిరిగాయి. ఖాళీ అయిన కాఫీ గ్లాసును తీసికొని యింటిలోకి వెళ్లిపోయింది. శాంతలోని మార్పుకు కారణం ... తన తల్లి ఏదో నెపంతో తగవులాడో లేక తిట్టో యుంటుందని గ్రహించాడు.

కాలచక్రం నిరాటంకంగా సాగిపోతున్నది. అత్తగారు ఎన్నిఅన్నా, ఎన్ని కష్టాలు పెట్టినా పల్లెత్తు మాట అనకుండా శాంతకాలం వెళ్లబుచ్చుతున్నది. భర్త కవన్నీ తెలిసీకూడ మెదలకుండా యుండటం శాంత మనస్సును కలవరపరస్తున్నా ఏనాటికైనా నిజమును గ్రహించకలుగుతారని ఆశించింది.

శేఖర్‌కు ఏదోపనియుండి ఉద్యోగానికి సెలవు పెట్టి మరొక యూరికి వెళ్లాడు. ఆ రోజున ఉదయం శాంత పిల్లల కన్నంపెట్టి చేతులు కడుగుతున్నది. అప్పుడే బావినుండి స్నానంచేసి నీళ్ళబిందె నెత్తుకొని వచ్చిరాగానే అత్తగారు "రంకుముండా యిది ఎంతకాలంనుండి - లేచిపో - నీకిష్టమయిన వాడితోనే పోయియుండు" అని యిల్లు ఎగిరిపోయేటట్లు వరవళ్లు త్రొక్కింది.

శాంత నిర్ఘాంతపోయింది. ఆ రంకెలువిని చుట్టుపట్ల యిరుపొరుగునవున్న వారంతా గుమిగూడారు. వాళ్లందరితోటి శాంతకు రంకులుకట్టి నానాతిట్లు తిడుతూ గోలగోలగాఏడుస్తూ బజారు కెక్కింది. అయోమయావస్థలో శాంతకు ఏమిపాలుబోలేదు.

గుమికూడినవారిలో చాలమంది "శాంత అటువంటి పిల్లకాదు; నోట్లో నాలుకలేనిది" అన్నారు. మరి కొందరు "ఎవరో పాడుముండలు యీ పుకారు పెట్టియుంటా"రన్నారు. యింకా కొందరు "ఏమో నమ్మా - యిందులో కొంత కాకపోయినా కొంత నిజంలేకపోతే పుకారు ఎలాగ పుడుతుంది" అన్నారు.

శాంత గుడ్లనీరు గుడ్ల కుక్కుకుంటూ యింట్లోనుండి బయటికిరాలేదు. గుమికూడియున్నవాళ్లు అలాగే నిలబడి యున్నారు. "అదైనా యుండాలి లేదా నేనైనా యుండాలికాని యిద్దరం ఉండటం యింక కుదరదు" అని బెబ్బులిలాగ గర్జిస్తున్నది.

ఆ రోజున వడగాలి తీవ్రంగా కొడుతున్నది. ఎండ క్రిందమీదకూడ మాడ్చివేస్తున్నది. శేఖర్ నడి ఎండలో తిరిగి తిరిగివస్తూ తన యింటెదుటి ఆ కోలాహలమంతా చూచేటప్పటికి గుండెల్లో బండ పడ్డట్లయింది. ఇంటిగడపలో కాలుపెట్టేసరికి శేఖర్ తల్లి పెద్దపెట్టున ఏడుస్తూ "ఇంకేముందిరా నాయనా! - యీ పాడుముండ మూలంగా మనపరువు ప్రతిష్టలు మంటగలిసి పోయేరోజులు వచ్చాయి. నేనిక బ్రతుకలేను" అంటూ బావిలో దూకడానికని పోబోయింది.

"ఏమిటమ్మా! యీ రచ్చంతా - అసలు సంగతేమిటో చెప్పు - యీ బజారు కెక్కడమేమిటి" అని శేఖర్ బ్రతిమలాడాడు.

"ఏమని చెప్పమంటావురా నాయనా! - నీ పెళ్ళాము నివురుకప్పిన నిప్పు - నీతో యిచ్చకాలు ఆడుతూనే ప్రక్కయింటి సుబ్బారావుతో ..." అంటూ గోడు గోడున ఏడ్వసాగింది.

ఎండలోబడివచ్చిన శేఖర్‌కు ఆకలిదప్పులొక ప్రక్క, యీ రచ్చ మరొకప్రక్క మహాచీకాకు పరచినవి. "అయితే యీ రచ్చంతా ఎందుకమ్మా" అన్నాడు బ్రతిమలాడే ధోరణిలో.

"నీ పెళ్ళాన్ని వెనకేసుకొనివచ్చి నేను చేసేది రచ్చంటావటరా కాబట్టే నిన్ను అది వెధవనుచేసి యింకొకణ్ణి తగులుకుంది. మీరే యుండండి యీ కొంపలో - నేను చెరువో, నుయ్యో చూచుకుంటాను" అని ఊరిమీదికి బయలుదేరింది.

శేఖర్ కాళ్ళా వేళ్ళాబడి "మెల్లగా విచారిద్దాముండమ్మా! - యీ రచ్చ రాద్ధాంతమువలన నలుగురు నవ్విపోవడమేతప్ప మరేమిలాభంలేద"ని శాయశక్తుల బ్రతిమలాడి భంగపడ్డాడు. ఆమె ఇంటింటి దగ్గర బారలేస్తూ చెప్పి చెప్పి ఏడుస్తూ బయలుదేరింది.

శేఖర్ మెల్లగా గదిలోకి వెళ్లేసరికి పిల్లలొక ప్రక్క, శాంత ఒక ప్రక్కనవచ్చి భోరున ఏడ్వసాగారు. పగులగొట్టుకపోతున్న తలను రెండు చేతులతో చిక్కబట్టుకొని కుర్చీలో కూలబడ్డాడు.

శాంత మెల్లగావచ్చి జలజల రాలుతున్న కన్నీటితో "ఏమండీ! మీరూ నా శీలాన్ని శంకిస్తున్నారా" అంటూ కూలబడి శేఖర్ పాదాలను పట్టుకున్నది.

"ఏమిచెయ్యమంటావు శాంతా! ... ఏమి లేకుండా యీ గొడవంతా ఎందుకు వచ్చియుంటుంది" అన్నాడు శేఖర్ ముఖము చిట్లించుకుంటూ.

"మీ అమ్మ తనస్నేహితురాలెవతో ఏదో చెప్పిందని నా జీవితాన్ని బజారులో పెట్టింది. ఇన్ని సంవత్సరాలనుండి కాపరముచేస్తున్న నన్ను మీరు అర్థం చేసికోలేకపోయారా! మీ అమ్మ యింతకాలము నుండి నా పట్ల ఎలాగ వ్యవహరిస్తున్నది మీరు చూస్తూనే యున్నారుకదా! ఇంతకాలమునుండి ఎన్ని బాధలుపడుతున్నా మీ ప్రేమానురాగాలతోటి, పిల్లలకొరకని జీవించి యున్నాను. మీరే నా శీలాన్ని శంకిస్తే నేను జీవించడం అనవసరం, తర్వాత మీ దయ ..." అన్నది. పిల్లలు బిక్కమొగమేసుకొని నిలబడి చూస్తున్నారు.

శేఖర్‌కు ఏమి పాలుపోలేదు. ఏమిమాట్లాడకుండా లేచిపోయాడు.

శేఖర్ తల్లి ఆ యూళ్ళోనే తన మేనల్లుని యింటికిచేరి యింటింట కుమారుడు రంకుముండైన భార్య వలలోపడి తన కన్నము పెట్టడంలేదని అసభ్యంగా ప్రచారం సాగించడం మొదలు పెట్టింది. ఊళ్ళోని చిన్న, పెద్ద, అయినవాళ్లు, కానివాళ్లు శేఖర్‌ను ఏదో వింతగా చూడటం మొదలు పెట్టారు. కొందరు స్నేహితులు "కాస్తో కూస్తో నిజములేకపోతే యీ అప్రతిష్టంతా ఎందుకు వస్తుందిరా" అనసాగారు. శాంత స్వభావం తెలిసినవారు ఆ యపవాదును నమ్మకపోయినా "ఈ పాడుముండ నోరు మంచిది కాదు" అని భయపడి యూరుకొనేవారు.

శేఖర్‌లో చెలరేగిన అంతర్యుద్ధం ఎడతెరపిలేనిదైంది. ఎంత తరచిచూచినా శాంత నిర్దోషిగానే కనుపించింది. కాని తల్లి చేస్తున్న ఆగడం, దుష్ప్రచారంతో తాను నలుగురిలో తలెత్తలేకుండా యున్నాడు. తల్లిని చంపేద్దామా అన్నంత కోపం వచ్చేది - కాని దానివలన ఏర్పడే పరిణామాలు ...... క్రమంగా శేఖర్ . మతిలేనివాడిలాగైపోయాడు. అన్నపానములమీద, కట్టుకునే గుడ్డల మీద - మరిదేనిమీద శ్రద్ధలేకపోయింది. తిన్నపూట తినేవాడు నాలుగు మెతుకులు ; పిల్లలేలాగున్నారో, శాంత ఎలాగున్నాదో - ఎవరితోను ఏమిమాట్లాడేవాడుకాదు. ఆఫీసుకుపోవడం మానేసి చాలకాలమయింది. అతని వాలకం, కుటుంబ పరిస్థితిని చూచి యిదంతా తన మూలంగానేకదాయని తానీజీవితరంగాన్నుండి తప్పుకుంటే తన పిల్లలు, భర్త సుఖపడతారేమో ననుకున్నది శాంత. ఒక రోజున గాఢాంధకారంలో పరలోక జీవితాన్ని వెతుక్కుంటూ బయలుదేరిపోయింది.

మరునాడు శాంత శవం ఊరివెలుపలి బావిలో తేలియాడటంచూచి ఊళ్ళో చిన్న పెద్ద అంతా చుట్టూ చేరారు. పిల్లలు గొల్లుమన్నారు. వచ్చీరాని దుఃఖంతో ఆదరించడానికి వచ్చిన తల్లినిచూచి "అమ్మా ! వచ్చావా ! - ఇక నీకు, నీ కుటుంబానికి అప్రతిష్ట యుండదు ! కొడుకూ, కోడలు, మనుమలు, మనుమరాండ్రతో జీవయాత్ర గడిపేగీత నీకున్నట్లయితే నీకీబుద్ధి పుట్టేదికాదు. ఇకమీదట మాగొడవ లేకుండా స్వేచ్ఛగా జీవించు; మేము వెళ్ళిపోతున్నాము" అని పిల్లలను వెంటబెట్టుకొని శేఖర్ వెళ్ళిపోయాడు. ఎక్కడికో ! - శాంత నన్వేషిస్తూనేమో !

---

"అయ్యా! మీ పేరేమిటండీ"

"ఎ. వి. రావు అండీ"

మీ చేత జాబు వ్రాయించుకుందామని వచ్చాను; మీకు ఏవి రాకపోతే మీరిక నాకు జాబు వ్రాసిపెట్టేదేమిటి"

వి. నాగేశ్వరరావు

♦ ♦ ♦

"పతిగృహస్తుడు ఖద్దరు వాడకమునందలి కళాకాంతులను హర్షించడానికి అలవాటుపడి దాని లావణ్యాన్ని పవిత్రాశయాలను గ్రహించకలుగాలి.

'గాంధీజీ'

# కళాజ్యోతి

శ్రీ రాయసం సుందర వెంకటరమణ

[శేఖర్, రమణ సంతకు బయలుదేరివెళ్ళి అచ్చట ఎప్పటిలాగ ఒక పూలకొట్టుదగ్గర ఎప్పటి యట్లు పూలన్నీ కొనేసి డబ్బిచ్చేసి బయలుదేరారు. ఆ రోజున ఆ పూలమ్మే పిల్లయొక్క తల్లితో మాట్లాడాలనే ఆసక్తితో పూలమ్ముకొని యింటికి బయలుదేరిన పిల్ల ముందు, వెనుక వారిద్దరు మెల్లగా గమ్యస్థానం చేరుకున్నారు. వాళ్ళిద్దరిని తల్లికి కళ పరిచయంచేసిన తరువాత శేఖర్, రమణ అరుగుమీద కూర్చున్నారు — యిక చదువండి.]

(గతసంచిక తరువాయి)

"నేమాటాడుతాను. నీవు భావికిపోయి నీళ్లు తెచ్చి వంట ప్రయత్నంచెయ్యితల్లీ" అన్న ముసలావిడ మాటలు ముగియక ముందే కళ కడవను చంక పెట్టుకొని గుడిసె వదలిపోయింది. "బాబుల్లారా! మీరు యెవరో మామీద యింత దయను చూపిస్తున్నందుకు నేనెంతో కృతజ్ఞురాలను. మేమేదో గంజిత్రాగి రామ కృష్ణ అనుకుంటూ యిలా కాలక్షేపం చేస్తున్నాము. మీ రెవరో, మాకెందు కింత దయకలిగిందో చెప్తారా" అంది. శేఖర్ నోట మాట రాలేదు. నావంక చూచాడు. నీవు కవి నంటావే. ఈవిడకు నచ్చ చెప్పు అని అతని చూపులోని అర్థం. నేకొద్దిగా నవ్వాను. ముసలి స్త్రీ వంక పరీక్షగా చూచాను. "అమ్మా మమ్ము లనుగూర్చి యెలాంటి దురభిప్రాయము పడ నవసరములేదు. మేమిద్దరము చిన్ననాటి స్నేహితులము. ఒకరినొకరు బాగా అర్థం చేసుకొన్నాము. జరిగిన పది సంవత్సరాల నుంచి యిలా సంతకు వెళ్లిరావడం మా కలవాటు. ఐదారు నెలలగా మీ అమ్మాయి సంతలో పూలనమ్మడం చూచాము. శేఖర్ ఆమెపడే శ్రమ వేదనచూచి యెంతగానో బాధపడ్డాడు. శ్రమపడ్డాడు. అతంది జాలిహృదయం. ఏకష్టాన్ని చూచినా బాధపడే స్వభావం అతంది. తన కాఫీ డబ్బులతో పూల నన్నిటిని కొనేసేవాడు ప్రతిదినం. ఎన్నో సార్లు కళ ఒకప్పుడు బాగా బ్రతికిన సంసారంనుంచి వచ్చింది అని చెప్పుతుండే వాడు. ఆమె మాటలు, నడవడిక దానికి నిదర్శనాలు. "కళ ముఖంచూస్తే ఏదోఅపరి మితమైన దయ, నిష్కారణమైన వాత్స ల్యము కలుగుతుంది" అంటుంటాడు శేఖర్. స్వాభావికంగా మనము కొందరి

ముఖాలన్నా, మాటలన్నా, చేతలన్నా యెంతగానో యిష్టపడుతాం. మఱికొంద ఱివి అసహ్యించుకొంటాం. అది మానవ తత్వంలో కర్మ సిద్ధాంతంమీద ఆధారపడి వుంటుంది. మీరు బాగా బ్రతికివుంటే మీ గడచిన జీవితం మాకు చెప్పడానికి తప్పకుండా సంశయిస్తారు. మానవుడు మానవునికి సాయంచేసుకోడం తప్పా! విశ్వ మానవ సౌభ్రాతృత్వమును పెంపొందించా లనే విషయము మీటింగుల్లో, వ్రాతల్లో ఉండిపొయ్యాయి. చెప్పినవన్నీ చెయ్య గలిగితే అందరు గాంధీ మహాత్ములుకారా! కాబట్టి ప్రతివ్యక్తి తన బాధ తోడి మాన వుడితో చెప్పుకున్నందువల్ల కొంతబరువు దిగ్గిపోయినట్లుంటుంది 'తలమీదినుంచి. అందువలన అమాయికత్వాన్ని, నేరాన్ని ప్రపంచానికి వెల్లడిచేసుకోవడమే వేదాం తంలో పరిపక్వమైనస్థితి అని మహనీయులు చెప్పారు. అందువల్ల మీరేమి సంశ యించనక్కరలేదు. మేము చేతనయితే సహాయం చేస్తాము. లేకపోతే సానుభూతి చిహ్నంగా రెండు కన్నీటి బిందువులను రాలుస్తాం'' అన్నాను.

౪

ముసలావిడ కొంచెంగా దగ్గింది. తర్వాత చాలా ఆయాసపడింది కళ్లె వుమ్మేసింది నెత్తురుతో. మాట్లాడడానికి ప్రయత్నించింది. మాట గొంతునుంచి బయటికిరాలేదు. తర్వాత అరుగుమీద పడుకుంది. మళ్లీ లేచింది. ''బాబుల్లారా! మీరంతగా అడుగుతుంటే నేను కాదన లేకపోతున్నా. మానిజమైన విషయము, మేమింతకుముందు గడిపిన జీవితం యీ దేవళం అర్చకుడుగారికితప్ప మరెవ్వరికీ తెలియదు. తెలియపర్చాలనికూడా నా వుద్దేశ్యముకాదు.

మీరనుకొన్నట్లు నేను బాగా జీవితం గడపినదాన్నే. పుట్టింట, మెట్టినింట సిరి యెల్లప్పుడు నాట్యంచేసింది ఒకప్పుడు. ఇక్కడికి 15 మైళ్ల దూరములో నున్న భాగ్యవరం మా అత్తవారి యూరు. జ్యోతిపురం మా పుట్టిల్లు. నాకొక తమ్ము డుండేవాడు. మా తండ్రి గుమాస్తాగా చేసినా మాకెలాంటికొఱత రానియ్యలేదు. చాలా గారాబంగా పెంచారు మా తల్లి దండ్రులు. నేకాపురానికి వచ్చిన రెండు సంవత్సరాలకు మా తల్లి దండ్రులకు ప్రపం చంలో ఋణం తీరిపోయింది. మా తమ్ముడు గుమాస్తా అయ్యాడుకాని తర్వాత చెడుసావాసాలతో ఆస్తినంతా చెడగొట్టి మంచంబట్టి గతిలేనివాడికిమల్లె మరణిం చాడు'' అంటూ కళ్ళు తుడుచుకుంటూంది.

''భాగ్యవరంలో స్కూలు మేనేజరుగా నుండేవారు మావారు. ఒక మాదిరి యిల్లు. కొంత మాగాణివుంది. అదంతా వారి మేనత్త యిచ్చిన ఆస్తి. అందువల్ల

మేనత్త కూతుర్ని మొదటి వివాహం చేసుకొన్నారు. ఒక్క కొడుకును కని ప్రపంచాన్ని వదలింది ఆ మహనీయురాలు. వారప్పుడు పిచ్చివారయ్యారు. ఆయనకు యీ వూరిలో ఒక ఆఫీసరు స్నేహితుడు. ఆఫీసరుకు బిడ్డలు లేనందున ఆ పిల్లవాణ్ణి పెంచడానికి తీసుకున్నారు. ఆ ఆఫీసరుగారే నా వివాహాన్ని జరిపించారు తన మిత్రునితో. 5 సంవత్సరాలు కాపురంచేసిన తరువాత అప్పటి నుంచి మా చిట్టి తల్లికి కష్టాలు అంటూ కడవతో ప్రవేశించినవి'' జ్యోతి తల నిమురుతూ యిలా చెప్పసాగింది. ''కళా! అంటూ వాళ్ళ నాన్నగారు పిల్చేవారు. నా జీవితానికి వాళ్ళ తండ్రి పోయిన తరువాత వెలుగిచ్చింది కాబట్టి జ్యోతి అని నేపిలుస్తాను. కాబట్టి మా తల్లి కళా జ్యోతి. పాపం! ఎన్నో కష్టాలు పడింది పిచ్చితల్లి. తర్వాత 9 సంవత్సరాలు భాగ్యవరంలోనే వున్నాము. తర్వాత మా మరిదికి మామీద నిర్దయకలిగింది. ఆ స్థితిలోయున్నప్పుడు యీదేవాలయార్చకుడు మమ్ములను కనికరించి యిక్కడ తలదాచుకోడానికి నీడనిచ్చాడు. మరణిస్తూకూడా వీళ్ల తండ్రి కొడుకును నన్ను కన్న కొడుకు మాదిరిగా చూచుకోమన్నాడు. మాస్థితి యిలా వున్నప్పుడు నిక్షేపంలా జీవితం గడుపుతున్న నా చిట్టి తండ్రి జీవితాన్ని, భవిష్యత్తును నా చేతులార మా దగ్గిరకు తెచ్చి చెడపడం యిష్టం లేకపోయింది. నేను కనుమూసేలోగా మా జ్యోతిని చిట్టి తండ్రి చేతుల్లో పెట్టి వాణ్ణే దాని వివాహంచెయ్యమని ప్రార్థించడం, వారి సుఖాన్ని ఆశించడం నా ఆఖరు కోరిక'' అని కథ ముగించింది. దగ్గు మళ్ళీ వచ్చింది. ఉష్మోసి పడుకొంది ఆయాసపడుతూ. ''మీ తండ్రిగారి పేరేమిటి అమ్మా'' అన్నాను కళతో. ''శ్రీనివాసయ్య'' అంది జ్యోతి. ''మీ అన్నయ్య ఇక్కడ యెవరి దగ్గఱ వున్నాడు'' అన్నా. ''త్రిపుర శంకర్‌గారింట్లో'' అని జవాబు.

నేను శేఖర్ స్తంభితులయ్యాము. ఒకరి వంక ఒకరు చూచుకొన్నాము పరీక్షగా. నాకు తెలుసు శేఖర్ మనస్సులో పెద్ద తుపాను చెలరేగింది. అమ్మా అంటూ ముసలమ్మ దగ్గఱకు చేరాడు శేఖర్. ''నేనే త్రిపుర శంకర్‌గారి దత్తుకుమారుణ్ణి. మా తండ్రి ఆయనకే పెంచుకోడానికి నన్నిచ్చింది. అభాగ్యుణ్ణి, కన్న కొడుకంటే యేమిటో, వాత్సల్యమంటే యేమిటో నేనిప్పుడే తెలుసుకొన్నాను. తండ్రిగారు మరణించిన మూడు సంవత్సరాలకుగాని నాకు ప్రపంచం తెలియలేదు. అమ్మాయని! పిలిచేభాగ్యం యీ నాడు కలిగింద నా జీవితంలో. కళా నీవు నిజంగా కళా జ్యోతివి; నా సోదరివి. నీవు సంతలో

పూలమ్ముకోవడం – మీకే 'గుడిసె నివాసమా' అన్నాడు కన్నీటితో శేఖర్. 'ఈ నాటికైనా నిన్ను చూడగలిగాను. అదే పదివేలు' అంది ఆనంద భాష్పాలతో ముసలావిడె.

''అన్నయ్యా''అంది కళ ఆప్యాయంగా. ''శేఖర్'' అన్నాను నేను చిరునవ్వుతో.

ఇలా కథ ముగిసిందని చాలామంది పాఠక మహాశయులు నిరాశ చెందవచ్చును! ఒక్క సస్పెన్సుగాని, యీ కాలం యువకులకు సరిపడే పవిత్ర ప్రేమగాథగాని కాదని మరికొందరు ఆక్షేపించవచ్చుగాని యీచిన్న సంఘటన యెన్నోమార్లు నన్ను కర్తవ్యపడేటట్లు చేయడమేగాక యీ కథ వ్రాయడానికి యుద్యుక్తునిగా చేసింది. ఇంకా సంతకు పోతూనే యున్నాము నేను, శేఖర్.

— —(o)——

ఖైరా జిల్లాకు చెందిన చారోటార్‌లో ఇంటింట ప్రతిరోజూ పెళ్లిళ్లు జరిగాయట. లగ్నంకోసం ఆగడం కాని, కట్నంకోసం బేరాలాడ్డంగాని లేదు! నవంబర్ తర్వాత దక్షిణాఫ్రికాకు కొత్తగా భారతీయులను శాశ్వతంగా వలసకురానివ్వరాదని మలాన్ ప్రభుత్వం నిర్ణయించడంకారణంగాగబగబా పెళ్ళిళ్లు చేసుకొని భార్యలను నవంబర్‌లోగా దక్షిణాఫ్రికాకు తీసుకొని వెళ్లడానికి యువకులు, ముఖ్యంగా పటేల్ తెగవారు ఆదరా బాదరా వివాహాలు చేసుకోసాగారట!

పిల్లా సుబ్బారావుశాస్త్రి





## చక్కెర బఠాణీలు

వేగిన బఠాణీగింజలను ఒక అళాకు యుంచుకొనవలెను. 2½ పలముల పంచదారను, అందులో చంచాడు నీళ్లు పోసిన పాత్రను పొయిమీద పెట్టి బాగా ముదురు పాకానికి రాగానే క్రిందికిదించవలెను. తర్వాత ఒక కుంపటిమీద సన్నని సెగపైన బాణలియుంచి తడవకు 10 బఠాణీలు, ¼ చంచాచక్కెర పాకం అందులోవేసి చిన్నగరిటితో పొర్లించినచో చక్కెర పాకం బఠాణీగింజల కంటుకొని తెల్లగా మారును. ఈ విధంగా పలుమారులుచేసిన గింజలన్నియు తెల్లగా చక్కెర బఠాణీలగును. ఇదేవిధంగానే శనగపప్పును, నువ్వులు చేయవచ్చును.

## కారంచూడా

ఒక అళాకు శనగలు, ఒక ఆళాకు బఠాణీలు, ఆళాకు పెసలు, అళాకు అలచందలు, అళాకు మినపప్పు నీళ్లలోవేసి నాననివ్వవలెను. ఆ తర్వాత పెద్దబాణలిలో తవ్వెడు యిసుకపోసి పొయిమీదనుంచవలెను. ఇసుక వేడికాగానే నానినశనగలు, బఠాణీలు వగైరాలను వడియవేసి యుంచుకొని అందులో నుండి కొంచము కొంచముగా యిసుకయున్న బాణట్లోవేసి పెళపెళ వేయించి తీసి యిసుకనుండి వేరుచేయవలెను. అలాగ వేయించి తీసినవానిలో కొబ్బరిని సన్నముక్కలుగా తరిగివేసి బాగాకలిపిన తర్వాత అందులో పసుపుపొడి, మిరపపొడి, నూరినఉప్పు పరిమితంగా వేసి కలిపి ఒకపలం నెయ్యి కాగనిచ్చి, అందులో కరివేపాకువేసి చిటపటమనునప్పుడు కలగలుపుగానున్న గింజలను అందులో వేసి బాగా కలుపవలెను. ఇది చాల రుచిగానుండి బాలబాలికల చిరుతిండి కనువుగా నుండును.

## రాగిపిండిబజ్జీలు

తవ్వెడురాగులు, పిడికెడుమినపప్పు, పిడికెడు శనగపప్పు నీళ్లలో నాననిచ్చి, 10 ఎండుమిరపకాయలు, చింతగింజంత ఇంగువ, కాస్తపసుపు ఉప్పు అన్నీచేర్చి మెత్తగా రుబ్బియుంచుకొనవలెను. ముక్కలుగా బీర, అరటికాయలుకాని, బంగాళా దుంపలుగాని, ఉల్లిపాయలుకాని తరిగియుంచుకొనవలెను. బాణలిలో నూనెపోసి బాగా కాగినతర్వాత పిండిలో ముక్కలను అద్ది అందులోవేసి ఉడికిన తర్వాత తీయవలెను. ఇవిచాలా రుచికరముగా నుండటమేకాక ఖర్చుతక్కువకూడాను.

## పచ్చిరాగుల అమృతఫలాలు

రాగి కంకులను గింజ ముదరకముందే తెచ్చి బాగా పొట్టులేకుండా నలిపి శుభ్రపరచి ¼ పడి చేసి యుంచుకొనవలెను. పచ్చికొబ్బరి తురిమియుంచుకొని రాగులతో చేర్చి నీళ్లు చల్లి మెత్తగా రుబ్బి సన్నని గుడ్డలోగాని, జల్లెడలోకాని వడియబోసి పాలుతీసి యుంచుకొనవలెను. ఇలాగా రెండుమూడు సారులు రుబ్బి పాలుతీయువలెను. అర్ధపడి రాగులతో షుమారు 1½పడి పాలువచ్చును. ఆ పాలను ఒక కళాయి పాత్రలో పోసి పొయిమీదనుంచి గంటసేపు ఉడుకనీయాలి. అప్పుడు పైకి తేరిన నీటిని పారబోసి 15 పలముల బెల్లంకాని, చెక్కెరకానివేసి పొయిమీదపెట్టి బాగా కలుపుతూ యుండవలెను. బాగా ఉడికిన తర్వాత కొద్దిగా గట్టిపడినప్పుడు ఏలకులపొడి, కుంకుమపువ్వు, కొద్దిగా పచ్చకర్పూరం, జీడిపప్పు, కేసరిపొడివేసి బాగా కలిపి పాకమునకు రాగానే నెయ్యిరాచి యుంచిన పళ్లెములో క్రుమ్మరించి ముక్కలు ముక్కలుగాకోసి ఆరిన తర్వాత తినవచ్చును. ఇది పదిరోజులు నిల్వయుండి రుచిగానుండును.

యం. ఆర్. సీతమ్మ

ప్రకృతి సౌందర్యము నడుమ

సౌందర్యవతులు

ముద్రింపబడిన, రంగు, సిల్కు



ధరించినవారు స్వదేశీ వస్త్రములనే కొనుడు
మంచిరకమునే కొనుడు



# సిరిసిరిమువ్వలు

ఆమె "ఏమండీ! గోపీకి ఒక సైకిలు కొనియ్యకూడదూ - వాడిగోల మితిమీరు తున్నది" అన్నది.

ఆయన "అయితే - సైకిలు కొనిపెడ్తే అల్లరిమాని తిన్నగా యుంటాడన్న మాట!"

"అది కాదండీ - దానిమీద యూరంతా తిరుగుతూ మరీగోల చేయడానికని"

♦ ♦ ♦

ఒక షాపులో ఏదో కొంటున్న ఒక స్త్రీ అమ్మకం దగ్గరనున్న వానితో "మీరిచ్చేసరకు తృప్తికరంగా లేకుంటే మరల వాపసు తీసికొంటారుగదండీ." అని అడిగింది.

"...కాని మీరు యిచ్చేడబ్బు సంతృప్తికరంగానే యుంది మాకు"

♦ ♦ ♦

ఒక స్త్రీ కుర్రాడిని బస్సులో తొడమీద కూర్చొనబెట్టుకొని ప్రయాణం చేస్తున్నది.

కండక్టర్ టిక్కెట్టు యివ్వడానికివచ్చి "ఏమమ్మా! పిల్లవాని వయస్సెంత" అని అడిగాడు.

"ఇంకా మూడు సంవత్సరాలు నిండలేదు"

తొడమీద కూర్చొనియున్న కుర్రాడు గభాలునదిగి "మా అమ్మకు నిన్నటికి 30 ఏళ్లు వెళ్లాయి" అన్నాడు.

♦ ♦ ♦

ఒక టీపార్టీకివచ్చిన డాక్టరుకు ఒక యువకుడు నమస్కరించి "మీరుచేసిన ఉపకారానికి చాల కృతజ్ఞుడను"

నిర్ఘాంతపోయి డాక్టరు "మీరెప్పుడూ నాదగ్గర చికిత్సపొందినట్లు జ్ఞాపకంలేదే" అన్నాడు.

"మా మామమటుకు చేయించుకున్నాడు. నేనతని ఆస్తికి మీదయవల్ల వారసుడనైనాను"

'అర్జునుడు'

# నష్టజాతకుడు

మాతృక :
శ్రీ కుష్వాహా కాంత్



అనుసరణ:
"హృదయిని"

గగనపథాన భయంకర మేఘాలు పరస్పరము ఆలింగనము చేసికొనుచు గర్జించుచుండెను. పెద్ద రోదనముతో జలము వర్షింపసాగెను. వారణాసి వీధులకు గంగా యమునలు దిగివచ్చినట్లుండెను. చినుకులు తనువుపై పడుటయే తరువాయి బల్లెములవలె బాధించుచుండెను.

వికలునిస్థితి నేడధిక చింతావహముగా నుండెను. అతనికి ఒకటేతీరుగా దగ్గు వచ్చుచుండెను. మాటిమాటికి రక్తపు తుప్పరలు నోటినుండి వెలువడుచుండెను. అతని శరీరోష్ణము వెనుకటివలెనే 105° ఉండెను. గులాబి తన తప్త హృదయముతో నాతని మంచము ప్రక్కనే కూర్చొని యుండెను. అజ్జలు రిక్షాతో బజారునకు వెళ్లినాడు. వికలుడు జ్వరోష్ణముతో అర్ధచైతన్యావస్థలో ముకుళిత నయనాలతో మంచములో ప్రతిమలా పడియుండెను. అతని శ్వాస ఒక్కటి వినిపించుచుండెను.

మేఘాల వికటగర్జనము విని వికలుడు ఉలిక్కిపడెను. లేవ ప్రయత్నించెను. కాని సగము లేచుటతోడనే తిరిగి మంచముపై పడిపోయెను. గులాబి అతనిని పట్టుకొనెను. కాంతి విరహిత నేత్రాలతో వికలుడు ఆమెవైపు చూచెను - కొంతకాలమట్లే ఏమీ గుర్తింపనట్లు అలాగే చూచుచు ఉండిపోయెను.

"ఏమిటీ గోల ?" అచంచల స్వరముతో వికలుడు ప్రశ్నించెను.

"వాన కురియుచున్నది." గులాబి ఆతని శిరస్సును తన మృదుల హస్తముతో నిమురుచు ప్రత్యుత్తరమిచ్చెను. కాని ఆమె స్వరము వినుటతోడనే వికలుడులిక్కిపడి - "ఎవరు? వదినా !"

"ఆఁ. నేనే !"

"నీవేనా వదినా ! కళ్లకెదురుగా చీకటి ... నాకేమి కనుపించుటలేదు వదినా"-గులాబి లోలోన కుమిలిపోయెను.

"నీవింతవరకిటనే కూర్చొని ఉన్నావా వదినా!"

"మరి, నీ జ్వరము తగ్గలేదుగదా !"

"వంట పూర్తయినదా."

"ఆఁ ! ... "

"తిన్నావా ?"

"లేదు ... "

"ఎందువలన తినలేదు వదినా !" వికలుడు ఎక్కువగా మాట్లాడినందుచే రొప్పసాగెను.

"ఆకలిలేదు" గులాబి ఉత్తరమిచ్చెను.

"ఎందుకని ఆకలిలేదు వదినా ! నీ కెందుకని ఆకలి వేయుటలేదు ?"

"నీవు జ్వరముతోనే బాధపడుచున్నావుగదా !"

"జ్వరమా !" వికలుఁడు తొట్రిలుచున్న స్వరముతో — "నేను సదా జ్వరపీడితుడనే ! వదినా ! ఇక నేను బాగు అగు ఆశలేదు ... ఈ జీవితముపై ఆశలేదు ... " "ఊరుకో ఊరుకో ... నీవు శిలాహృదయుడవు ! ఒకరి హృదయాన్ని బాధించుటలో నీకేమి వచ్చును ?" అనుచు గులాబి తన కరాన్ని వికలుని నోటిపై ఉంచినది. వికలుడు నిశ్శబ్దుడయ్యెను. గులాబి అతని వదనమును తన హస్తముతో నిమురసాగెను. వికలుని కామె హస్తమందు సంజీవనిశక్తి ఉన్నట్లు తోచెను. విలుప్త జ్యోతి అతని నయనాలలోనికి క్రమేపి తిరిగి వచ్చినది - కాని

శిరోవేదన, జ్వరోష్ణము అధికమయ్యెను.

వర్షము ఇంకను కురియుచునే ఉండెను. శీతల వాయువు ఊపులు, వర్షపుజల్లు వికలుని పీడను ద్విగుణీకృతము చేయుచుండెను. అతడు మరణాసన్న వాణితో - "వెళ్లు వదినా! భోజనముచేయి ... నాఆశ విడువు ... నేను ఆకాశాన ఉవ్వెత్తుగా ఎగరవేయబడి పోవుచున్నట్లు ప్రతీతమగుచున్నది..."

"అయ్యో దేవుడా! ఏలాగున్నది నీకు?" అని గులాబి దుఃఖాకులయై పల్కెను.

అట్టి సమయాన అఫ్జలు వర్షధారలతో సిక్తుడయి వచ్చెను. అతని గుడ్డలనుండి టప్...టప్...మని నీటిబొట్లు పడుచుండెను. ద్వారమందే అతడాగి అడిగెను - "ఎలా ఉంది ఆరోగ్యం?"

"భగవంతునిదే భారము." గులాబి మరల నిట్లనెను - "వంట తయారైనది. పద నీకు పెట్టెదను" గులాబి, అఫ్జలు వంటగదిలోనికి వెళ్ళిరి.

వికలుడు అంతా చూచుచున్నాడు - అఫ్జలు బజారునకువెళ్లి ఒక గంటలో నాల్గయిదు రూపాయలు సంపాదించి తీసికొని వచ్చుచుండెడివాడు. ఇప్పుడు తను కారణముగా రోజంతయు రిక్షాలాగుచు-లాగుచు బాధపడుచున్నాడు. కాని పొట్టకూటికి ఒక కానీ అయిన దొరకుటలేదు. నేడీవర్షములో కూడ అతనికి విశ్రాంతిలేదు. అతడు తడుస్తూ రిక్షా తీసికొని వెళ్ళినాడు - తడుస్తూ తిరిగి వచ్చినాడు.

వికలుని హృదయము హాహాకారము చేసెను. అయ్యో! ఈ అఫ్జలు నష్టజాతకుడనయిన నాకోసమేమి చేయలేదు! ఎన్ని కష్టాలు సహింపలేదు! ఇతడు గుండాకాడు! మానవమాత్రుడుకాడు! నేనో యితరుల కష్టార్జితముపై జీవించుచున్నవాడను! ఇతరుల శిరముపై భారమైనవాడను ... నాకోసము ఇతరులకుడ కష్టాలను తెచ్చిపెట్టుచున్నవాడను ... ఈ ఊహలతో వికలుని హృదయము భారమాయెను. అతని నయనాలనుండి అశ్రుబిందువులు వెలువడజొచ్చెను. లోలోన "ఉండను ... ఇక నేనిక్కడ ఉండను ... ఇతరుల ఆదరముమీద - ఇతరుల భిక్షమీద ఆశ్రితుడనయి ఉండను...నాచేతనయినది సంపాదింపగలను ... నేను స్వయముగా రిక్షాలాగగలను ... ఒక్కచేయి అయిననేమి! ... రిక్షాలాగుట కిదిచాలు ..." వికలుడు మంచములో నుండి లేచి నిలువబడెను. అతని దుర్బల చరణాలు కంపించెను ... కాని తనను సంబాళించుకొనెను. చిత్రమేమోగాని అతని శరీరములో ఎచటి నుండియో దైవీకబలము వచ్చెను. అతడు ద్వారము వైపు నడచెను! ఇప్పుడతని మస్తిష్కమా వికృతము! అతని సమ్ముఖమున సర్వజగత్తు పరిభ్రమించుచున్నట్లుండెను.

అతడు నిశ్శబ్దముగా ద్వారముదాటి బాటనందుకొనెను. వర్షమింకను కురియుచునే యుండెను. తన రిక్షాఉన్నవైపు ముందడుగు వేసెను. కంపమెక్కువాయెను. కాని అతనికి ఆత్మబలము తోడుగానుండెను. అతడు తన ఒక్కచేతితోనే రిక్షాను పట్టుకొని వర్షములో తడియుచు పురోగమించెను.

♦ ♦ ♦

"గుడ్డలు విడువను. ఇప్పుడు వెంటనే రిక్షా తీసికొని వెళ్లవలెను. ఈరోజున ఒక్క కానీ అయినను దొరకలేదు." అన్నము తినుచు అఫ్జలు పలికెను.

"ఆయన మనసు స్థిరముగాలేదు. మనసునకు వచ్చినదానినెల్ల చెప్పుచున్నాడు" అని ప్రారంభించి గులాబి చెప్పదొడగెను - "నీ వాయన మాటలువిని ఎందుకు కష్టపడెదవు? రిక్షాలాగుట వదలిపెట్టు. పూర్వము చేసిన దానినే చేయి..."

"ఊరకో! నీకేమి తెలియును? ... ఇతరులు సంపాదించిన ధనాన్ని దోచుకొనుటలో వీరత్వము లేదు - తాను సంపాదించుకొన్న దానిని దోచుకొనుటయే వీరత్వము ... వికలుడు ఒంటరిగా ఉన్నాడు. వెళ్లు అతగాని దగ్గరికి. నాకవసరమయిన కేక వేసెదను" అని అఫ్జలు ప్రత్యుత్తరించెను.

## నష్టజాతకుడు

గులాబి వికలుని గదిలోనికివెళ్ళి తత్క్షణమే పరుగిడుచు తిరిగివచ్చి "ఆయనలేడు!"

"లేడూ!" కంచమెత్తి పడవేసి లేచి నిలువబడి - నోటిలోని అన్నాన్ని నేలమీద ఊసివేసి అప్జలు పల్కెను - "ఏమన్నావు! లేడా! ఎక్కడికి వెళ్ళినాడు? ..." వికలుని గదివైపు పరుగెత్తి చూచెను - అతడెక్కడను కానరాలేదు. ఎదురుగా రోడ్డుమీద చూడగా రిక్షా మాయమయి యుండెను. అప్జలు చేతులతో తలబాదుకొని - "అతడు రిక్షాతీసికొని వెళ్ళినాడు ..." అని అరచెను.

♦ ♦ ♦

వర్షవేగము - మేఘాల గర్జనలు తగ్గలేదు. వికలుడు తూలుచు తూలుచు ఒంటిచేతితో రిక్షాను లాగుగొనుచు రోడ్డుమీద నడుగిడుచుండెను. అంతిమావస్థలో అతని శరీరమున దైవిక జవసత్వములు పనిచేయుచుండెను.

రోడ్డు ప్రక్కన చింపిరి గుడ్డలు దాల్చిన ఒక పిచ్చిది బిచ్చమడుగుకొనుచుండెను. వికలుని చూచిన వెంటనే ఆమె పరువెత్తుకొనివచ్చి అతని చరణములపైవ్రాలి, "వికలా ... నన్ను మన్నించు వికలా!" అని ఆ ఉన్మాదిని ఆర్తనాదము చేసెను. వికలుడు ఆమెను గుర్తించెను - ఆ పిచ్చిది తన సవతితల్లి రసనాదేవియే ... పాపాల అభిశాపాన్ని అనుభవించుచున్నది!

వికలుడు ఆమెవైపు ఒకసారి దయార్ద్రదృక్కులబరపి, తన రిక్షానుతీసికొని పురోగామి అయ్యెను. ఒక పెద్దషాపువద్ద వర్షబిందువులచే సిక్తులయిన ఒక జంట నిలువబడి యుండెను. రిక్షారాకచూచి పురుషుడు కేకవైచెను - వికలుడు రిక్షాను ఆపెను. దంపతులిద్దరు రిక్షానెక్కి కూర్చొనిరి. వికలుడు మఱొకవైపు చూచుచుండెను. తనరిక్షాలో ఎవరెక్కిరో, తనకు కూలీ యెంత దొరకునో - ఆ ఆలోచనయే లేదు. వర్షముచే తడిసి పోవునాదుర్దాతో దంపతులును రిక్షావాలాయందు ధ్యానమూవంతయు నుంచలేదు. వికలుడు రిక్షాను తీసికొని మెల్లమెల్లగా అడుగులు వేయసాగెను. అతని పాదములుతొట్రుపాటు వడుచుండెను. కురియుచున్న పెద్దపెద్ద నీటిబిందువులు అతని హృదయమును భిన్నము చేయుచుండెను.

వికలుని మందగమనమునకై విసివికొనుచు పురుషుడనెను - "ఏయ్! వేగముగా తీసికొని పో!"

"పోనీయండి. నిర్భాగ్యుణ్ణి, ఒకప్రక్క వర్షము కురియుచున్నది. రెండవవైపు, ఒంటిచేయివాడు..." స్త్రీ రిక్షావాలాను 'సిఫార్సు' చేసెను.

తర్వాత ఆ స్త్రీ పురుషులిద్దరు పరస్పరము సంభాషింపదొడగిరి!

"చాలా విచారించితిని. కాని అతని జాడ దొరకలేదు...ఎక్కడ దాగుకొన్నాడో..." అని పురుషమహాశయుడు.

"అప్జలుకూడ పత్తాలేదు! ఆయన తరచుగా నగరములో తిరుగుచు ఆ అప్జలును కలిసికొనుచు ఉండవచ్చు..." స్త్రీ ప్రత్యుత్తరించెను.

ఆకస్మికముగా రిక్షావాలాకు దగ్గువచ్చి, నోటినుండి రక్తము వెలువడి, అతడు రిక్షాతోపాటు నేలపైబడెను. దంపతులు క్రింద పడిపోయి తట్టుకొనిరి. కాని రిక్షావాలాను చూచి స్త్రీ కేకవైచెను- "వికలూ! వికలూ"

మరణాసన్నవికలుండు వారిద్దరిని చూచెను. అతని శరీరము అభిమానితమాయెను. క్షీణస్వరముతో అతడు - "కాంతా! ... అనూప్"

అటుపై వాతోద్వేగతరంగములతో కలిసి అతని ప్రాణవాయువు ఎగిరిపోయెను.

ఇంతలో "వికలూ! ..."అని పరుగెత్తుకొనుచు వచ్చి అప్జలు వికలుని కళేబరముపై వ్రాలెను. ఆ నిర్జీవశరీరాన్ని కదిలించి చూచెను - అంతయు సమాప్తి అయిపోయెను!

గులాబికూడ సటకువచ్చి వికలుని శవాన్ని చూచి తన హృదయాన్ని బాదుకొనుచు విలపింపసాగెను. అఫ్జలుకు ఏడుపురాలేదు. నేటివరకతడు ఎప్పుడును దుఃఖించి ఎరుగడు. సిక్తనేత్రాలతో అతడు గులాబి వైపు చూచుచు - "ఊరుకో! ఊరుకో పిల్లా."

కాంతా, అనూప్ విక్షిప్తులవలె నిలువబడిపోయిరి. సజీవుడయిన వికలునికై వారు వెదకుచున్న ఆ వికలుడు ఇప్పుడు ఈ ప్రపంచములో తన పార్థివతనువును వదలి పోయినాడు. చర్మాస్థులతో మాట్లాడెడి ఆ విగ్రహ మిపుడెక్కడ! ఇప్పుడెక్కడున్నది?

"అయ్యో! ఖుదా!" అను పలుకుచు దీర్ఘకాయుఁడు అఫ్జలు వంగి వికలుని శవాన్ని ఎత్తుకొని మెడపై సరిచేసికొనెను. ఒకచేతిలో శవమును పట్టుకొని మరొక చేతిలో రిక్షాను తీసికొని, గులాబితో- "పదపిల్లా!...వికలుఁడు వెళ్లి పోయినాడు. మనదరిద్రము మనతో చివరిదాక నిలచి ఉండును. మనము తిరిగి అదేమాదిరి మనరోజులు వెళ్లబుచ్చెదము-లోకుల ధనాన్ని దోచుకొనుచు, లోకులను మోసగించుచు, మనకా చెడుదారే సరిగా...సత్యముకోసము దరిద్రమనుభవించిన వికలుడు లేడు! ఖుదాతోడు! మనలను మోసగించి వెళ్లిపోయాడు విశ్వాసఘాతకుడు..." ఆదుర్దాంత జేబుదొంగ కళ్లనుండికూడ అశ్రుబిందువులు అవిరళముగా ప్రవహించెను.

"పోదాముపద!" గులాబి పల్కెను. ఆమె నేత్రాలు నీరసములు-శుష్కములాయె. దుర్భరదుఃఖమామెనయనాలను శోషింపజేసినట్లు తోచుచుండెను. అఫ్జలు రిక్షాను ఈడ్చుకొనుచు ముందుకు కదిలెను. గులాబి అతనిని అనుసరించెను.

అఫ్జలు వెళ్లుటచూచి కాంత కేకవైచెను - "అఫ్జలు! రా...మా దగ్గరికి రా!"

నల్లని అఫ్జలు ఒకసారి తిరిగి ప్రజ్వలితనయనాలతో కాంతవైపు చూచెను. మాటాడక అతడు పురోగామాయెను. కాంత మరల దయార్ద్రస్వరముతో పిలచెను "అఫ్జల్! అఫ్జల్!... శవాన్ని తిసికొని మా యింటికిరా ..." పరువెత్తివచ్చి ఆమె అఫ్జలు భయానక హస్తాన్ని పట్టుకొని, "నడువు అఫ్జల్! నీవుకూడా దరిద్రాశ్రమములో ఉండి జీవితాన్ని గడుపు...శవాన్ని తీసికొనిరా..."

"మీకు శవము కావాలా!" అఫ్జలు గంభీర వాణితో పలికెను - "నాప్రాణమైనా మీకు దొరకునుగాని యీ శవముమాత్రము దొరకదు తల్లీ! ఖుదాతోడు! వికలుఁడు తానొక్కడే చచ్చిపోలేదు. నన్ను చంపిపోయాడు!" దుఃఖాకులుడు అఫ్జలు పునఃపురోగామి అయ్యెను.

"అఫ్జల్! మాతో రా అఫ్జల్!" అని కాంత ఎలుగెత్తి పిలుచుచుండెను.

అఫ్జలు ఏమియు వినుపించుకొనక - చూడక - ముందుకు పోవుచుండెను. ప్రక్కనే పోవుచున్న ఒక టాంగావాలా యిలా ఆలాపించుచుండెను—

"ఉండు నీవు సేమంగా...!

ఓ మేడల్లో మిద్దెల్లో తిరిగేటి దాన!

నా మేడలూ మిద్దెలూ నామురికి గల్లీలేను సుమ్మా!"



చికాకుగానున్నభర్త భార్యతో "అసలు యీ యింటికి యజమాని ఎవరో తేల్చిచెప్పు" అన్నాడు. మెల్లగా భార్య "దానిని తెలిసికోడానికి ప్రయత్నించకుండాయుంటే మీరు మరింత సుఖంగానుంటారు" అన్నది.

♦ ♦ ♦

ఆఫీసుకు సెలవుబెట్టివచ్చి బంతిఆట చూస్తున్నవాణ్ణి చూచి "ఇదేనా సెలవుపెట్టి నీవు వెళుతానన్న మీమామ కర్మాంతరము" అని అడిగాడు.

పిల్లవాడు తడబడకుండా "అలాగేయుంది. మామామ యీ ఆటలో పర్యవేక్షకుడు" అన్నాడు.

# పూర్వాంధ్ర మహిళ

శ్రీ కడెము వేంకట సుబ్బారావు



మొల్ల మొల్లై తెల్గుతల్లి క్రొమ్ముడిలోనఁ
క్రొత్త నెత్తావులు క్రుమ్మరించె;
భద్రాంబ యాంధ్రి సంపద్రూపరాశియై
మధుర మోహనముగ మాటలాడె;
వెంకాంబ తెలుఁగమ్మ చంకపిల్లయి రస
పాయియై తీయఁగాఁ బాడుకొనియె,
ఆంధ్రీ పురంధ్రికి నడ్డాల బిడ్డయై
రంగాజియమ్మ తా రంగమాడె,
ముద్దుపళని తామరపువ్వు గద్దెనెక్కి
పసిఁడిమువ్వ కాలినిఁ ద్రొక్కిపట్టి కదిపె,
స్త్రీ హృదయ సాహితీ రీతి చెప్పుకొనియె
ఆంధ్రమహిళా మతల్లి పూర్వాంధ్రమందు.

పచ్చల పిడిబాకుఁ బసిపాప నొడిలోనఁ
ద్రుళ్లింత లాడించె రుద్రమాంబ
ప్రక్కలో బల్లెమై పగతులఁ దూలించి
కరుణించి విడిపించె గణపమాంబ
మాంచాల బాలుండు మరులెత్తి కవిసిన
బొటవ్రేలి నెత్తురు బొట్టువెట్టె
ముంజేతిమీసంబు మొలకెత్త డాల్కత్తి
మ్రోఁగించి కుప్పించె నాగసాని
ఓడివచ్చిన తిక్కన్న నుదకమాడఁ
బసపుముద్ద మంచముపెట్టె వానిభార్య
సబల స్త్రీ యంచు నెలుగెత్తి చాటుకొనియె
ఆంధ్రమహిళా మతల్లి పూర్వాంధ్రమందు.

భారతాంధ్రీ కరణారంభమందు గం
టమునకుఁ బసపు కుంకుమముపూసి,
రణభేరి వేయించి రంగస్థలికి దూఁకు
కాకతీయులకును రేకదిద్ది,
పైదేశికులతోడ వాగ్వాదముల కేఁగు
శ్రీనాథునకు విందుచేసిపెట్టి,
దక్షిణాపథమెల్లఁ దనయేలుబడిక్రింద
నలరించు రాయల కారతిచ్చి,
తంజపురి రఘునాథు నాస్థానమలికి
రంగవల్లిక తీర్చి తోరణముగట్టి,
జాతి నిత్యాభివృద్ధికి సాయపడియె.
ఆంధ్ర మహిళా మతల్లి పూర్వాంధ్రమందు.

తిక్కన్న గంటాన దిద్ది తీరుపఁబడ్డ
రూప బుద్ధి కలాప ద్రోవదమ్మ
శ్రీనాథ గ్రంథానఁ జిత్రీయమైనట్టి
లాలిత్యదేహ కళావతమ్మ
పింగళి సూరన్న సంగీత ఫణితిలో
గమనింపఁదగిన సుగాత్రిదేవి
రామలింగని కళా ప్రాభవమ్మొలికింపఁ
జాలినట్టి నిగమశర్మయక్క
విష్ణుచిత్తీయమునఁ బాండ్యవిభుని వెలఁది
వేషభాషలలో నాంధ్ర యోషలైరి
కవి పలుకు కళాధామమ్ముగా నొసర్చె
ఆంధ్ర మహిళా మతల్లి పూర్వాంధ్రమందు.



# ప్రఖ్యాత కవయిత్రులు —

# తరికుండ వెంకమాంబ

శ్రీమతి ఎం. వేదవల్లితాయారమ్మ



ఆంధ్ర సాహితీ క్షేత్రంలో వన్నె కెక్కిన విదుషిగా కవయిత్రిగా పేరుబొంది, ఆధ్యాత్మిక సాధనలలో పరమావధి బొందిన తరికుండ వెంకమాంబ 19వ శతాబ్ద మధ్య భాగంలో 1840 సం|| ప్రాంతాలలో జీవించియున్నదని పరిశోధకులు నిర్ణయించారు. ఈమె జన్మస్థానము తరికుండ. ఆ తరికుండయే తరిగొండగా గృహనామమయింది. ఈ తరికుండ గ్రామము కడపజిల్లాలోని "వాయల్పాడు" గ్రామానికి నాలుగు మైళ్లదూరంలో ఉంది.

ఈమె తండ్రి కృష్ణయామాత్యుడు. తల్లి మంగమాంబ. ఈమె బాలవితంతువు. బాల్యమాదిగా ఆధ్యాత్మిక చింతనలతోనే కాలంగడపిన పుణ్యశీల. శ్రీ కృష్ణభక్తురాలు. వెంకటాచలపతి యీమె యిష్టదైవము. పతి సేవుని పేరుకూడా వెంకటాచలపతియే. ఈమె వేదాంత దేశికుడు సుబ్రహ్మణ్యగురుడు. ఈమె వ్రాసిన ద్విపద, భాగవతములో తన చరిత్రనంతా వివరించింది.

"ధరపైని వెలయు నందవరాహ్వయుండు|
గురుతర సువశిష్ఠ గోత్రసంభవుడు|
కానాలి వంశ సాగర హిమాంశుండు|
నైనకృష్ణార్యున కతిభక్తితోడ|
నంగన యగు మంగమాంబ గర్భమున|
సంగతి కృష్ణుండు సైదోడుగాగ|
వెంగమాంబిక ప్రభవించి లింగాంగ|
భంగంబు కొఱకు సుబ్రహ్మణ్యగురుని|
చరణాబ్జయుగళి హృజ్జలజమందుంచి
అరసి పూజించి తదనుమతి వడసి"

అని తన పుట్టింటి చరిత్ర చెప్పింది.

"వరుసగా నుంజేటి వంశ భూషణుడు|
గురుతర శ్రీ వత్సగోత్ర సంభవుడు|
ఘనుడైన తిమ్మయార్యగణి పుత్రుడనగ|
జనులెన్న వెంకటాచలపతి పాద|
వనజ యుగ్మంబు భావంబునందుంచి"

అని అత్తింటి వివరాలు తెలిపింది. ఈమె బాలవితంతువు అగుటవల్ల తండ్రివద్దనే యుండి విద్యాభ్యాసంచేసి అపరసరస్వతివలె విజ్ఞానాన్ని సంపాదించింది. సహజపాండిత్యంగలదగుట చేత చిన్నతనంనుంచీ కవిత్వంచెప్పేది. ఈమె తన రచనలన్నీ ద్విపదభాగవతంలో పేర్కొన్నది. కాని వానిలో యిప్పుడు మనకు కొన్నే కనబడుతూ ఉన్నాయి. (1) నరసింహ శతకము (2) నరసింహ విలాసకథ (3) శివనాటకము (4) పారిజాతాపహరణ సత్కృతి (5) రాజయోగ సారము (6) కృష్ణనాటకము (7) రమాపరిణయము అనే పెండ్లిపాట. (8) చెంచు నాటకము అనే కథ (9) కృష్ణమంజరి (ద్విపద) (10) రుక్మిణీనాటకము (11) గోపికానాటకము (12) వేంకటాచల మహాత్మ్యము. "ముక్తికాంతా విలాస"మను యక్షగానముకూడా రచించినట్లు వేంకటాచల మహాత్మ్యములో తెలిపింది. కాని వీనిలో రాజయోగసారము, ద్విపద భాగవతము, వేంకటాచల మాహాత్మ్యము, అనే మూడు గ్రంథాలు మాత్రమే మనకు దొరికాయి.

ఇంకా శ్రీనివాసునిమీద వ్రాశిన పాటలు, పద్యాలు, స్త్రీలపాటలు ఎన్నెన్నో చిల్లరరచనలు కూడా వ్రాశిందని ప్రతీతి. కవిత్వపాండిత్యాలకంటె బ్రహ్మజ్ఞాన సంపద నెక్కువగా చూరగొన్నది. ఈమె గ్రంథాలన్నీ యించుమించుగా ఆధ్యాత్మికతత్త్వాన్నే బోధచేస్తాయి. యోగాభ్యాసంచేసినయోగిని. శ్రీ తిరుపతి కొండలలోని "తుంబురుకోనలో" (పాపనాశన తీర్థానికి పోయే దారిలోవుంది) నీమె పండ్రెండేండ్లు తపస్సుచేసి యీ గ్రంథాలన్నీ వ్రాశిందనిచెబుతారు. ఈమె బాల్యంనుండీ గాఢవైరాగ్యంపొంది తండ్రిగారి దగ్గరే భాగవతాది పురాణాలు, సీతారామాంజనేయము మొదలైన వేదాంత గ్రంథాలు చదివి పరిపూర్ణజ్ఞానం సంపాదించిన సాధుశీల. "గతిర్భర్తా ప్రభుస్సాక్షీ" అనుగీతా వాక్యాన్ని మననముచేసికొని తత్ఫలితాన్ని పొందిన పవిత్రమూర్తి. పరమభాగవత శిఖామణియైనయీమెకు భగవంతుడు అనేక దివ్యదర్శనాలిచ్చినట్లుగా తన గ్రంథాలలో అక్కడక్కడ చెప్పుకొన్నది. తాను వ్రాసే గ్రంథంలో నెక్కడైనా శృంగారరసం వర్ణించవలసివచ్చినట్లయితే; శృంగారరసానుభవం సుంతైనా చవిచూడని యీ సుశీల ఆశృంగారోక్తులు నీవే చెప్పుకోమని తన యిష్టదైవాన్నుద్దేశించి

"శృంగారా కృతితోడవచ్చి పదముల్
శృంగార సారంబుతో
డం గూఢంబుగ జెప్పు నీవనగనట్లే చెప్ప
లేనన్న నన్
ముంగోపంబున జూచి లేచియటనే
మ్రొక్కంగ మన్నించి త
చ్ఛృంగారోక్తులు తా నెబల్కికొను నా
శ్రీ కృష్ణు సేవించెదన్ "

అని గ్రంథాదిని చెప్పింది. ఇందీకవయిత్రి భగవంతునితో ముఖాముఖిని మాట్లాడినట్లుంది. ఆకాలంలో కొందరు పామరులీమె మహిమ తెలిసికోలేక యీమెపై దోషారోపణలుచేసి చివరకు తత్త్వము తెలిసికొని యీమె జోలికి రావడానికి భయపడేవారని కొన్ని కథలు చెబుతారు.

భాగవత తృతీయస్కంధములోని "కపిలదేవహూతి సంవాదము" వస్తువుగా తీసికొని యీమె "రాజయోగసారము" అనే పేరుతో ద్విపదకావ్యం వ్రాసింది. "ముక్తికాంతా విలాసము" అనే యక్షగానము వ్రాసినట్లు వెంకటాచల మహాత్మ్యంలో పేర్కొన్నది.

ఈమె కవిత గంగాలహరివంటిది. పోతనభాగవతచ్ఛాయల ననుగమిస్తుంది. పురాణశైలి. సంస్కృత సమాలతోనిండి నిబిడీకృతమై యుంటుంది. పాండిత్యానికేమీ కొదువలేదు. "శ్రీతరికుండలక్ష్మీ నృసింహ కరుణా కటాక్ష కవితకవితా విలాస" అని గద్యలో వ్రాకొన్నది. అచ్చటచ్చట స్వల్పదోషాలున్నా మొత్తముమీద కవిత్వమంతా సరసమైనదనే చెప్పాలి.

ఈమె "వేంకటాచల మాహాత్మ్యము" ఆరాశ్వాసముల గ్రంథము పురాణమువంటిదని చెప్పవచ్చు. ఇందులో అనేకములైన చిన్నచిన్నకథలతో వెంకటాచలంలోని తీర్థమాహాత్మ్యములు స్థలమహిమలు వర్ణింపబడ్డాయి. గ్రంథమంతా ఒక సరణికిరాదు. కానియే కథకాకథ రసోదంచితమై యుంటుంది. ఆశ్వాసాదిని శ్లోకాలుకూడా ఉన్నాయి. ఈమె సంస్కృత భాషనుకూడా సాకల్యంగా సాధించినట్లు కనబడుతుంది. ఈమె విమర్శనా దృష్టికూడా సువిశాలమైనది. వెంకటాచలానికి చింతామణి, జ్ఞానాద్రి, పుష్కరాద్రి, నారాయణాద్రి, నరసింహగిరి, వరాహగిరి, నీలగిరి మొదలైన పేర్లు ఏయే సందర్భాలలో వచ్చినది వ్యుత్పత్తులతో సహా ఉల్లేఖించింది.

"అంజనాదేవి తపముమున్న చట జేసి।
వడసె హనుమంతుడను మేటికొడుకు
నెమ్మి

నపుడుదే వతలెల్ల సహాయులగుచు।
నామమిడి ర్వాయం దంజనాద్రియనగా''

వెంకటాచలానికి ఆంజనేయుని పుట్టుకవల్ల అంజనాద్రి అనే పేరు వచ్చినదట.

వస్తువర్ణనములోనీ మెకవిత పాఠకులకు ప్రత్యక్షము చేసినట్లుంటుంది. వేంకటాద్రిని వర్ణిస్తూ

''మేరుసమాన మా తేరు శృంగారించి
నట్టుల శ్రీ వేంకటాద్రి యొప్పు
రమణీయమగు చైత్రరథము చందంబున
కన్నుల పండువై కానవచ్చు''

అని మంచి అలంకారముచేసిన గొప్ప రథమువలెను, దేవేంద్రుని నందనవనంవలె ఉన్నదని చేసినవర్ణన యెంత మనోహరంగా ఉన్నదో చూడండి!

చక్కని ఉపమానాలలో తెలుగుతనాన్ని తెలిపే రచనలెన్నో ఉన్నవి. వపాయాగము చేస్తున్న ఋషుల వద్దకు విటవేషము ధరించివచ్చిన హరిసొగసు

''మేఘంబుపై వెల్గు మెఱపు దీగలవలె
దగినబంగరు జన్నిదంబు మెఱయ''

ప్రకాశించినదట. వేశ్యవేషముతో హరివెన్నంటి వచ్చిన లక్ష్మిని చిత్తరువు గీసి చూపింది.

''బటువుముత్యముల పాపటబొట్టు
రాకడి
జడబిళ్లలును కుచ్చులడరి వెలుగ
... ... ...
మగఱాలకమ్మలు పగడాలపేరులు
చెవులగళంబున జెన్నుమీర
... ... ...
చిరుతగజ్జెలు మొలనూలు చిందు
ద్రాక్కు
ఘల్లుఘల్లని పదహంసకములుమెఱయ
శ్రీవనిత విశ్వమోహినీ। దేవియయ్యె''

ఇందు లక్ష్మీదేవి వర్ణన తీర్చిదిద్దినట్లున్నది.

తృతీయాశ్వాసములో గురుసేవము గురూపదేశము ముముక్షువులకుండే జిజ్ఞాసము, జీవేశ్వర స్వరూపము తారక సాంఖ్య అమనస్క యోగాదులు అత్యద్భుతంగా వర్ణించింది. సాధనచతుష్టయ సంపత్తి పొందిన యోగాభ్యాసకులుగాని యిటువంటి విషయాలు వ్రాయలేరు. అయోమయంవంటి తత్త్వజ్ఞానాన్ని అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు చదువరుల యెదుట పెట్టింది మనవెంకమాంబ. యోగులుచేసే అష్టోత్తర శతసంఖ్యగల ఆసనాదులన్నీ సులభశైలిలో వివరించింది. ''శ్రీ గురుబోధ విశేషతగల బుద్ధిచే మానసము సుస్థిరముగ జేసికొనిన'' మహనీయురాలు. ధౌతిక్రియ, వస్తికర్మ, నీతికర్మ మొదలైన హఠయోగాదులుకూడా యీ యోగిని అభ్యసించియుంటుంది. లేకపోతే ఆయాక్రియలు చేసినందువల్ల కలిగే రోగశాంతు లంత సులభంగా చెప్పడం చాలాకష్టం.

''అరగన్నులతో నైనను। మురువుగ
నొగిరెండు
కనులు మూసియునైనన్ బరమాత్మ
ను లోజూ
పున। గుఱిగానీక్షింపవచ్చు గురు
భక్తుండై''

అని ధ్యానయోగాన్ని అనుభవపూర్వకంగా చెప్పింది.

''చతుర్మధ్యంబున బర మాతురహై
రణ్య సచ్చి
దమృతకణంబుల్ సాక్షిగ బాహ్యాం
తరముల
నీక్షించుచు నిత్యసుఖములు''

అనుభవించిన సాధకురాలు. ఇటువంటి నిగూఢ విషయాలు ''అనుభవైక వేద్యంబగుగాని వాక్కున జెప్పగూడదు'' అనికూడా చెప్పింది. అన్నియోగాదుల కంటె శాంతమే అధికమని

"ఉపశాంతిలేని మనుజుల
జపతపములు యోగవిధులు సవనాదు
లాగిం
గపటములై చెడుగావున
ఉపశాంతియ పరమధర్మము క్ష్మాస్థలి
లోన్"

అని చెప్పుటచే నీమె సాత్వికభక్తితోగూడిన రాజయోగముచే బ్రహ్మ సాక్షాత్కారము నొందినట్లూహింపవచ్చును. శ్రీనివాసుని చరిత్రలు, మహిమలు వర్ణించే గ్రంథంలో అభ్యాసయోగాదులను గురించి ఒక ఆశ్వాసమంతా వ్రాసిందంటే యీమె ఆబ్రహ్మ విద్యలో నెంతో కృషిచేసి పరిపూర్ణ ఫలితాన్ని పొంది, ఆ దివ్యానుభూతులను గ్రంథస్థము చేసిందని చెప్పవచ్చును. అనుభవశూన్యుల కలవిగాదీవ్రాత.

చదుర్థాశ్వాసం మొదలుకొని చివరవరకు మూడాశ్వాసాలు "వైకుంఠంమును వీడి శేషగిరిపై వల్మీకగర్భంబులో శ్రీ కాంతుండు వసించి చేసిన మహాచిత్రంబులు" అన్నీ ప్రబంధశైలిలో వ్రాసిందీ పుణ్యకవితాతపస్విని.

ఇందలి కథ

ఆకాశరాజునకు భూమిదున్నుచున్నపుడు జనక చక్రవర్తికి జానకీదేవివలె పద్మావతీదేవి దొరుకుతుంది. కలిజీవుల నుద్ధరించడానికి వైకుంఠము వదలి వెంకటాచలం మీద వల్మీకంలో వేంచేసిన వెంకటాచలపతి లక్ష్మి అంశసంభూతురాలైన ఆ బిడ్డను వరించి వివాహం చేసుకొంటాడు. ఈ కథ నవరస భరితమై ప్రాచీన ప్రబంధ శైలిలో నడిచింది.

ఈమె భక్తి మహాత్మ్యాన్ని తెలిపే కథలెన్నో దేశంమీద చిత్రవిచిత్రంగా అల్లుకొని ఉన్నాయి. గ్రామవాసులు ఆమె భక్తిని పరిశోధించడానికి పెట్టే బాధలు సహించలేక చివరికాలంలో తిరుమల జేరి శ్రీనివాసుని సన్నిధినే శేషజీవితం గడపి తన యెనుబదవయేట వైకుంఠ ప్రాప్తి పొందింది. అప్పట్లో నీమె తన ప్రత్యక్షదైవమైన వెంకటేశుని మీద వ్రాసిన పాటలు పద్యాలు లెక్కకు మిక్కిలిగా ఉన్నవి.

(విజయవాడ ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)

# ★ పరమ సత్యము ★

శ్రీమతి లంక అమృతాంబ

కూలిపోయిన గుడిసెలోపల
కూలిపోయెను సడలి దేహము
చిన్ని కొమరుని చక్కగానే
చూడనోచకనే – ఆమె
చూడనోచకనే.
వదలలేక వదలు తల్లిలో
కదలలేక కదలె ప్రాణము
మెదలలేక మెదలిపోయె
మేఘములలోకే – ప్రాణము
ఆకసములోకే !
గమన మెప్పుడు గతులు తప్పదు
గతులు తప్పిన మతులు తప్పను
మతుల్లు తప్పిన సతులు సుతులను
మమత లెట్లుండుర్ – ఇలలో
మమత లెట్లుండుర్
తల్లిపోయిన తరుణమందే
తల్లడిల్లెను దేహమంతా !
మనసు అల్లదె మూర్ఛవోవ
మమత కరిగె నదే – ఆ
మమత కరిగె నదే !
కళ్లలోపల కరిగిపోయిన
కళ్లగట్టిన కథలమాదిరి
ఉల్లమంతా ఝల్లుమన్నది
ఊరడిల్లకనూ – తా
ఊరడిల్లకనూ !
అంతదాక అమ్మ ఉన్నది
అంతవరకు హాసమున్నది
అంతదాకా కబురు సెప్పిన
అమ్మ ఏమాయె – మా
అమ్మ ఏమాయె.
ఎక్కడమ్మా పల్కవమ్మా
ఎచటికేగితివమ్మ నీవు
అమ్మరమ్మా వేగరమ్మా
అమ్మ రావమ్మా – మా
అమ్మ రావమ్మా
పిలచి పిలచీ గొంతు కెండెను
సాగిరమ్మా – తరలిరమ్మా
పిలువలేనిక పలుకలేనిక
అమ్మ రావమ్మా – మా
అమ్మ రావమ్మా.
చెట్టులారా చేమలారా
పుట్టలారా గుట్టలారా
గట్టులారా యిట్టె సెప్పుడు
అమ్మ ఏమాయె – మా
అమ్మ ఏమాయె.
పురుగులారా పరుగులెత్తక
పక్షులారా పారిపోవక –
కొమ్మలారా కబురు సెప్పుడు
అమ్మ ఏమాయె – మా
అమ్మ ఏమాయె.
గాలిదేవుడ వానదేవుడ
దేవులారా దైతలారా
భూమితల్లీ పల్కవమ్మా
అమ్మ ఏమాయె – మా

అమ్మ ఏమాయె.
నింగిలోపలి చుక్కలారా
నవ్వుచుండెడి చందమామా
కమ్మనైనా కథలువద్దు
అమ్మ కావాలి - మా
అమ్మ కావాలి.
ఆకసంబే చిల్లిపడగ
పుడమి గుండెలు బ్రద్దలవ్వగ
సూర్య చంద్రులు దద్దరిల్లగ
అరచుచుండగనూ - ఆతడు
అరచుచుండగనూ!
పురుగులన్ని పరుగలెట్టుచు
తిరిగివచ్చి కూడుకున్నవి
పక్షులన్ని ఎగిరిపోవక
ఆగిపోయె నదే - అట్టే
ఆగిపోయె నదే!
చందమామయె నవ్వకుండగ
చక్కగానె నిలచిపోయెను
చుక్కలల్లో కాంతియంతా
కరగిపోయినదె - అట్టే
కరగిపోయెనదే!
చెట్టులన్నీ చేరనోకచో
పుట్టలన్నీ పలుకుకున్నవి
చేమలన్ని గోముగానే
కలసిపోయెనవె - అట్టె
కలసిపోయెనవె!
గాలిదేవుడు వానదేవుడు
గజగజామరి వణికిపోయిరి
భూమితల్లికి గుండెలల్లే
కరగిపోయెనదె - అట్టె
కరగిపోయెనదే!
దేవులంతా కూడిరంతట
దైతలంతా కలసిరంతట
వారు వీరితో, వీరు వారితో
వేగ త్వరపడిరి - అతి
వేగ త్వరపడిరి.
పూలు తామే అల్లుకొనుచూ
మాలలై మరి ముందుకొచ్చుచు
మెల్ల మెల్లగ బాలుజేరి
మెడను నిలచెనవె - అవ్వే
మెడను నింపెనవే!
ఫలములన్ని పగిలిపోయి
ముక్కలయ్యి ముందుకొచ్చి
పసిడిబాలుని పంచజేరి
నోట దాగెనవె - వేగమె
నోట జేరెనవే!
భూమితల్లి చూకెనట్లె
వమ్ముగాను పగిలెనట్లె
నీరు కొద్దిగ పైకితన్ని
నోటపోసెనదె - బాలుని
నోట పోసెనదె!
అలసి సొలసిన బాలుకొరకై
అలుపు సొలుపులు దీర్చుకొరకై
మలయపవనము మాదిరై మరి
గాలి సోగెనదె - ఆట్టె
గాలి సోకెనదె!
ఆకులన్ని కలుసుకుంటూ
అప్పుడప్పుడె కూడుకుంటూ

మెల్లగానే ఊగుకుంటూ
గాలిపోతాయి - చల్లగ
గాలి పోతాయి!

చంద్రుడెంతో చల్లదనము
చక్కగాను పరచుచుండగ
చుక్కలన్ని మురిసిపోయెను
మిణుకు మిణుకుమని - అట్లే
మిణుకు మిణుకుమని.

చిన్నగడ్డి చివురులెత్తి
చిన్నపరుపై అతనికంత
మెల్లమెల ఆనందమివ్వగ
తల్లడిల్లెనదె - అట్టే
తల్లడిల్లెనదే!
ప్రకృతంతా కులుకు నాపి
పనులనన్నీ యిట్టెఆపి
బాలునెంతో దరిని జేర్చుకు
జోలపాడెనదె - హాయిగ
జోలపాడెనదె!
అలసిసొలసీ బాలుడంతట
పలుకసాగెను కలతనిద్రలో
మెల్లగానటు ఓరగిల్లి
ముద్దులొలకంగా - బాలుడు
ముద్దులొలకంగా!
"అమ్మ అదిగో అమ్మ అదిగో
ఆగవమ్మా నాగకమ్మా
నన్ను వదలి పరుగులెట్టకు
నేను నేనమ్మా - అమ్మా
రమ్మ రావమ్మా!"
అందరానీ అందమంతా
అనుభవిస్తు బాలుడట్లె
అమ్మ తలుచుకవమ్మలేక
అట్టె ఉండెనదే - బాలుడు
అట్టె ఉండెనదే!
అహర్నిశలూ అట్టె ఉండెను
అమ్మకోసం ఏడ్చి పిల్లడు
అమ్మ వస్తుందన్న నమ్మిక
అంతరించకయో - అట్టె
ఉండిపోయెనయో!
ప్రకృతె అతని తల్లి తండ్రి
ప్రకృతె అతని చెలిమిబలిమి
ప్రకృతె అతని పెద్ద దిక్కు
ప్రకృతె అతని సర్వసంపద
పరమ సత్యమదే!

——(౦)——

## క్రొత్త పాత సామెతలు

ఏరెంతపారినా కుక్క గతుకు నీళ్లేగతి.
రమ్మని రంగంపెడితే పొంగలి పెట్టినారట
విచిత్ర వీరారెడ్డికి వీపులో కాళ్లు
కొన్నవాడు కోతిఅంటే కన్నవాడు గాడిదంటాడు.
నచ్చితే నాతంటాడు; నచ్చకుంటే కోతంటాడు.
పొల్లించి, పొల్లించి తన్నినా మీసానికి మన్ను కాలేదట.

అక్కవల్ల బావచుట్టం; ఆళ్లవల్ల తిరగలి చుట్టం.
అందరూ మంచంక్రింద దూరితే అతను కంచంక్రింద దూరాడట.
జగాన్ని ఊచేనాథుడికి బిడ్డను ఊచేదానికి తెలియదట.
అలసి అలసి అక్కయింటికిపోతే అక్కపోయి బావ పక్క వేసెనట.

యం. ఆర్. సీతమ్మ

# అదా కారణం!

డాక్టర్ 'గిరి'

ఆ వేళ 'కలకత్తా మెయిలు' యిరవై నిముషాలు 'లేటు' అయినందువల్ల, బెజవాడ స్టేషనులో రైలు నిలిచేసరికి మావారి 'రిష్టువాచి'లో ఏడుగంటల అయిదు నిమిషాల వేళైంది. మా వారి వాచి యెప్పుడూ అయిదు నిమిషాలు హెచ్చించే పెట్టబడి ఉంటుంది కాబట్టి అప్పుడు సరిగ్గా ఏడుగంటలే అన్నమాట! ముందు రాత్రి చెన్నపట్నంలోచేసిన భోజనం, తిన్న చిరుతిళ్లూ, అన్నీ అప్పటికి పరిపూర్ణంగా జీర్ణమై పోయినందువల్ల కామోసు, కడుపులో ఆకలి 'కమ కమ' మంటూ ఉంది. అందువల్ల మావారితో యిలా అన్నాను.

"ఏమండీ! రైలు నిలిచి అయిదు నిమిషాలైనా అయి ఉంటుంది. మీకేమీ ఆకలికావడం లేదేమో గాని నాకు మాత్రం ..."

"మంచిదానివే! నాకు మాత్రం ఆకలవడం లేదనుకొన్నావా! వీళ్లందర్నీ త్రోసికొంటూ, రైలు దిగి, ప్లాట్‌ఫారంమీద పడేంతలో మళ్లీ రైలెక్కడ బయలుదేరుతుందో అని భయపడుతున్నాను" అన్నారాయన.

"మరేం ఫరవాలేదు. అరగంటకి పైగానే నిలబడుతుంది. మరచెంబు ఖాళీచేసి ఉంచాను. ఏమి లేకపోయినా, యిన్ని కాఫీ నీళ్లైనా పట్రండి మీ పుణ్యం ఉంటుంది" అన్నాను.

మావారు ధైర్యంచేసి, ప్రయాణీకులతో క్రిక్కిరిసి ఉన్న మూడోతరగతి పెట్టెలోంచి, ఒక్కొక్కర్నీ మెల్లిగా తప్పించుకొంటూ, 'ఏమిటయ్యా కాలు తొక్కేశావు' అనే ప్రయాణీకుణ్ణి మంచిచేసుకుంటూ, ప్లాటుఫారంమీదికి ఊడిపడేసరికి యెంతలేదన్నా పదినిమిషాలు పట్టిఉంటుంది. 'ఖాళీ' మరచెంబును నేను కిటికీలోంచి, ఆయన కందించి, 'అమ్మయ్య! ఇహ కాఫీ దొరికిందన్నమాటే' అని మనసు నిబ్బరం చేసికొని, "బెజవాడ స్టేషనులో 'కాఫీ' ఎలా ఉంటుందో" అని నేను అనుకొంటూన్నంతలో మావారు 'గబగబ' పరుగెత్తుకొంటూ రావడం చూచాను.

"అనుకొన్నట్టు ఒట్టి కాఫీ మాత్రమే తెస్తున్నారు. ఓ రెండు యిడ్లీ ముక్కలుకూడా తెస్తేనేమో!" అని తలుచుకొంటూ, కిటికీవద్దకు సమీపించిన, ఆయన చేతిలోని మరచెంబును అందుకోబోయాను.

"అందులో ఏముంది — నీమొహం! 'పర్సు'పట్టుకెళ్లకుండా వెళితే, కాఫీ ఎలా వస్తుంది? వేగంగా 'పర్సి'లా యియ్యి" అన్నారాయన. 'కాఫీ అయినా దొరుకుతుందికదా' అని అనుకొంటూన్న నాకు కొంచెం ఉత్సాహ భంగం కలిగినప్పటికీ, వెంటనే ఆయన విడిచివెళ్ళిన కోటుజేబులోఉన్న పర్సునుతీసి, ఆయనచేతి కిచ్చాను. ఆయన మళ్ళీ పరుగెత్తుకొంటూ వెళ్లారు.

అంతలో మా 'పెట్టె'లోనికి ఒక పురుషుడు ఎక్కుటకు ప్రయత్నించాడు. తలుపుదగ్గర 'ద్వారపాలకుల్లాగ' కూర్చున్న ప్రయాణీకు లాతనితో "ఎలా ఎక్కుతావయ్యా బాబూ! పోనీ నువ్వొక్కడివేయేమో అనుకుంటే నీతోకూడా 'ఆ విడ' ఆ విడతోకూడా 'బిడ్డ'! ఈ పెట్లో నిలబడ్డానికైనా జాగాలేదే!" అని అన్నారు.

"ఎలాగోలాగ గడుపుకోవాలిమరి — ఏ పెట్లోనూ జాగాలేదాయె - ఏంచెయ్యగలం? అలాగని ప్రయాణం మానుకోగలమా?" అన్నాడా క్రొత్తాయన.

'రైలు బయలుదేరే సమయం' అని తెలియజేస్తూ మొదటి 'గంట' వినవచ్చింది. ప్లాటుఫారం, జన సమూహంతో నిండిఉంది. మావారు వచ్చేజాడ

కనబడ్డంలేదు. 'దిక్కుమాలిన కాఫీ లేకపోతేనేం! ఆయన్ని మళ్లా యెందుకు వెళ్లనిచ్చానా' అని అనుకొంటూండేసరికి రెండో 'గంట' వినబడింది. ప్లాటుఫారంలో 'హడావిడి' ఎక్కువైంది. ఇటు పరుగెత్తేవారు, అటు పరుగెత్తేవారు. వాళ్ల మధ్యలో పండ్లు, ఫలాహారాలు అమ్మేవాళ్లూ! 'గార్డు' యీలవేసిన శబ్దంకూడా వినబడింది. మావారి 'ఫికరు' లేదు.

క్రొత్తగా వచ్చిన ప్రయాణీకుడు తన చేతిలోని పెట్టెను, హోల్డాలును రైలు పెట్టెలో క్రుక్కి, తన వెనుకనున్న స్త్రీని, బిడ్డను లోపలికి ఎక్కించాడు. అంతతో అక్కడఉన్న కాస్త జాగా పూర్తి అయింది. 'అతను ఎలా ఎక్కుతాడు? ఆ విడ అడ్డంగా నిల్చుంటే మావారు లోపలి కెలా వస్తారు?' అనే సందేహం కలిగింది నాకు. మూడో 'గంట' శబ్దం వినబడింది. మావారు రావడం కనబడింది. ఆయన యెడమచేత్తో మరచెంబునూ, కుడిచేత్తో ఒక పొట్లమును పట్టుకొని వగర్చుకొంటూవచ్చి, వానిని కిటికీలోనుంచి నాచేతి కందిచ్చారు. అంతలో రైలు కదిలినట్లైంది — కదిలిందికూడాను. 'వేగిరం ఎక్కండి' అని నేనాయన్ని తొందర పెట్టేను. ద్వారంలో నిలబడిఉన్న ఆ స్త్రీని తగిలీ తగలకుండా, ఒకరిద్దరి కాళ్లుమట్టి, ఎలాగోలాగ లోపలికివచ్చి ఆయన జాగాలో ఆయన కూర్చున్నారు. క్రొత్త ప్రయాణీకుడు 'మెట్టు'మీద నిలబడి, సగము తలుపువేసికొని ఉన్నాడు. నేను మెల్లిగా 'పొట్లము'నువిప్పి అందులోఉన్న రెండు యిడ్డెన్లు, రెండు గారెలుతీసి, ఆయనముందు పెట్టేసరికి 'నావంతు అక్కడే తినేశాను. ఇవన్నీ నీకే' అన్నారాయన.

'అందుకేనా యింత ఆలశ్యం అయింది!' అని అంటూ ఫలాహారం చేయుటకు ఉపక్రమించాను. మావారు ప్రయాణీకులవైపుచూస్తూ 'ఇదుగో శారదా! అక్కడ పిల్లని ఎత్తుకొని నిలబడిందే, ఆవిడను ఇలా వచ్చి కూర్చోమను!' అన్నారు నాతో.

“ఆ విడ కూర్చోడానికి జాగా యెక్కడఉంది?” అన్నాను నేను.

'జాగాకేమిటి? నేను అలావెళ్లి నిల్చుంటాను. ఆమెను కూర్చోమను' అన్నాడాయన.

ఆయన పరోపకారబుద్ధి బాగానే ఉందికాని, ఆయన కష్టపడి ఒకరికి జాగా యివ్వడం నాకంతగా నచ్చలేదు. అందువల్ల “తనకుమాలిన ధర్మం-మొదలు చెడ్డబేరం అంటారు కదా? మీరు శ్రమపడుతూ మరొకరికి చోటివ్వడం ఏమిటి? ?” అన్నాను.

“నీకు తెలియదులే! మొదటామెను పిలువు.” అని శాసించారాయన.

'సరే' ననుకొని “ఇదిగో అమ్మాయిగారూ! ఇలా రండి. ఇక్కడకూర్చోండి. పాపం! బిడ్డతోకూడా ఎంతసేపని నిలబడతారు గనక!” అని గట్టిగా అరచాను; రైలుశబ్దానికంటే యెక్కువగానే. మావారు అప్పటికే, ఎడమచేతివైపున ఉన్న కిటికీ దగ్గరకు వెళ్లి నిలబడి, తను కూర్చుండిన జాగా 'ఖాళీ' చేశారు.

ఆ 'అమ్మాయికి' నామాటలు వినిపించినందువల్ల, ఆమె ఆట్టే మొగమాటం పడకుండా మెల్లిమెల్లిగా నా ప్రక్కకు వచ్చి కూర్చుంది. అప్పటికి నేనొక యిడ్డెను ఒక గారె మాత్రమే తినగలిగాను. అవి ఇంకా గొంతుకదిగినట్లులేదు. అందువల్ల కొద్దిగా నీళ్లుత్రాగి, 'కాఫీ' చల్లారి పోతుందనే భయముతో మరచెంబు మూతతీశాను. కాఫీని గ్లాసులోపోసికొని కొద్ది కొద్దిగా త్రాగుతూ, అప్పుడప్పుడు ప్రయాణీకులవైపు, మావారివైపు చూడడం మొదలు పెట్టేను. 'మెట్టు' మీదనిలబడిన ప్రయాణీకుడు లోనికివచ్చి తలుపువేసికొన్నాడు. మా వారు ఎందుకో చిరునవ్వు నవ్వేరు. నన్నుచూసే నవ్వుతున్నారేమో అని అనుకొన్నాను. నేనుకూడా నవ్వుముఖం పెట్టేను; కాని అంతలోకే నాప్రక్కనున్న యువతి మందహాసం చేయడం కనిపించింది. 'ఎవరిని చూచి నవ్వుతోందా? అని అనుకొంటూ మావారి ముఖం చూచాను. ఏమిచిత్రం! వారిద్దరు, ఒకరిని చూచి ఒకరు నవ్వుకొంటున్నారని గ్రహించాను. 'మావారికీమె పరచయస్థురాలా? అందుకే మావారామెకు తన 'జాగా'ను యిచ్చి గౌరవించి ఉంటారా' అని దీర్ఘంగా ఆలోచించాను.

అంతలో, తలుపువద్ద నిలబడియున్న పురుషుడు నా వైపు సాభిప్రాయంగాచూసి, నా ప్రక్కనున్న యువతితో "రాజీ! బిడ్డకు 'హార్లిక్సు' పొయ్యావా?" అని ప్రశ్నించాడు.

"పెట్టిలోంచి తీసి యియ్యండి పోస్తాను" అంది ఆవిడ.

ఆ యువతిపేరు 'రాజమ్మో రాజ్యమో, రాజ్యలక్ష్మో' అయి ఉంటుందని ఊహించి "ఏమండీ రాజ్యలక్ష్మిగారూ! ఆయన మీకు..." అని అనబోయేసరికి

"నాపేరు రాజలక్ష్మి కాదులెండి. నాపేరు రాజ్యం. ఆయన నా పెనిమిటి" అని ఆమె పటపటమని, 'జంకు గొంకు' లేకుండా చెప్పింది.

"మీ రెంతవరకు ప్రయాణం?" అన్నాను.

"బరంపురం వరకేలెండి" అన్నదామె, ఏదో ప్రక్కనే ఉన్న స్టేషను అన్నట్టుగా. నిజానికి చూస్తే ఆ వేళ రాత్రి పన్నెండు గంటలవుతుంది బరంపురం చేరేసరికి! మా వారు ఎంతసేపని నిలబడవలసి వస్తుందో అనే పరితాపం నాకుకలిగింది. ' ఆయన ముఖంలో మాత్రం ఎట్టి కష్టమనీతోచినట్లు కనబడ లేదు. అంతలో ఆమెనన్ను చూచి "మీ పేరేమిటి?" అంది. నా పేరు 'శారద' అని అన్నాను. "మీ రెంతవరకు ప్రయాణం?" అంది మళ్లీ. "కలకత్తావరకు" అన్నాను. "అమ్మయ్యో! రేపు ప్రొద్దుట పదిగంటల వరకూ ప్రయాణం చెయ్యాలే" అంది ఆవిడ. "అవును" అన్నాను నేను. "కలకత్తాలో ఏమిటి విశేషం?" అంది ఆవిడ. "మా వారికి ఉద్యోగ మైంది." అన్నాను. "సంతోషం! మీరు అదృష్టవంతులు. అదృష్టవంతుల్ని చెరిపేవారూ లేరు, దురదృష్టవంతుల్ని బాగుచేసేవారూ లేరు" అంది ఆవిడ.

"మీవారికేం పని?" అన్నాను.

"భోజనం" అంది.

"అదేమిటలా అంటారు? హాస్యాని కంటున్నారా?"

"హాస్యంలేదు గీస్యంలేదు. నిజమే చెబుతున్నాను. అయిదేళ్లకు పూర్వం ఆయనకు కొంత ఆస్తి ఉండేది. అప్పట్లోనే నన్నాయన కిచ్చి, నిక్షేపంవంటి సంబంధంవద్దని విడిచిపెట్టి, ఆస్తి ఉందికదా అని నన్ను ఆయనకేయిచ్చి పెండ్లిచేశారు. ఇప్పుడీగతికి వచ్చాము" అన్నదావిడ.

"ఇప్పుడేమైందో చెప్పలేదే?" అన్నాను నేను.

"ఆస్తిపోయింది. అప్పులు మిగిలాయి. స్కూలు ఫైనలు పాసయారుగాని చిన్న ఉద్యోగాలంటే పరువుతక్కువ. పెద్ద ఉద్యోగాలు దొరకవు" అన్నదామె.

"ఆస్తి ఎలాపోయిందైతే?" అన్నాను నేను.

"ఏవో గుఱ్ఱపుపందెములనీ, అవనీ, యివనీ అనేక మార్గాల్లో పోయింది. ఎలా పోతేనేం? పోవడం నిజం." అందామె.

"అయ్యోపాపం!" అని అంటూ నా సానుభూతిని ప్రకటించాను. అంతలో ఆమె భర్త పెట్టె తెరచి 'హార్లిక్సుబుడ్డి, ఫ్లాస్కు' అందిచ్చాడు. ఆమెకన్నా నేనే సమీపంలో ఉన్నందువలన, నేనేవానిని అందుకొని రాజ్యానికిచ్చాను. నేనతనివద్దనుండి వానిని అందుకొనేటప్పుడుఅతడు నన్ను చూచి నవ్వేడు. నన్ను చూచి అతడెందుకలానవ్వుతున్నాడో నాకర్థంకాలేదు. "మీకు అత్తగారూ, మామగారూ, ఉన్నారా?" అని ఆమెను ప్రశ్నించాను. "మామగారు మరణించి పదేళ్లైంది. అప్పటికి నాకు పెళ్లేకాలేదు కాబట్టి ఆయన ఎలా ఉండేవారోకూడా నాకు తెలియదు. అత్తగారు ఉన్నారు. ఆడుది. ఆమె యేమి చేయగలదు?" అందామె.

"వాళ్లదేవూరు?"

"నెల్లూరు."

"ఇంటి పేరో?"

"గోరోజనంవారు."

"గోరోజనంవారా? మీ ఆయనపేరు ప్రసాద రావుగారు కదా?"

"అవును. మీకెలా తెలుసును ?"

"నన్నాయన కివ్వాలని ఒకప్పుడు ప్రయత్నం జరిగింది. పెళ్లి చూపులకని ఆయన మా యింటికి వచ్చారు. నేనాయనను అంత బాగా చూచుటకు సిగ్గుపడ్డాను; కాని నేనే ఆ పెండ్లికి సమ్మతించలేదు. అందువల్ల ఆ సంబంధం తప్పిపోయింది" అన్నాను.

"బ్రతికారు! ఇంతకీ నాకూ ఆయనకి 'ముడి' పడి ఉండగా మీకాగ్రహచారం ఎలాపడుతుంది' నన్ను మీవారికిచ్చేందుకుకూడాఅలాగే ప్రయత్నాలు జరిగాయి. నేను సరేనన్నాను; కాని మా అమ్మ ఒప్పుకోలేదు. 'ఆస్తి,' లేనివాడు నీకెందుకమ్మా! కొంచెం కట్నం ఎక్కువైనా ఆస్తి ఉన్నవాడినేచేసికోవడం మంచిది" అని మా అమ్మ అడ్డుపడింది. అని అంటూ ఒక పెద్ద నిట్టూర్పు విడిచిందామె.

ఆమె మావారు నవ్వుకోడానికీ, నన్నుచూచి ఆమె పెనిమిటి నవ్వడానికి కారణం తెలిసింది. "రాజ్యం గారూ! విచారించకండి. కష్టాలు కాపురముండవు. ఇంతకీ 'ఘటని' ఎలాఉందో అలా జరుగుతుంది." అని ఆమెను ఓదార్చాను.



# వేయి పడగలు

శ్రీ ఉకుమళ్ల కామేశ్వరరావు

—o—

విశ్వనాథ సత్యనారాయణగారు నవలాకారులు. వారు వ్రాసిన నవలల్లో వేయిపడగలు ఒకటి.

క్రిందటి శతాబ్దం ఆఖరి పాదమందే భారత కాంగ్రెసుసంస్థ బ్రిటిష్ ప్రభుత్వంలోని బాగోగులను విమర్శించడం మొదలు పెట్టింది. బ్రిటిష్ రాజనీతి మన దేశీయులకు అవగతమవుతూవచ్చింది. అయినా మంచి చెడ్డలను గ్రహించిన వ్యక్తులు కొందరే! ఆంగ్లవిద్యాప్రభావంవల్ల దేశంలో అనేకమంది బ్రిటిష్ మానసిక పుత్రులు బయలుదేరారు. వారికి పాశ్చాత్య నాగరికత అంటే పరమప్రీతి. అది అస మానమని వారి తలంపు. బ్రిటిష్‌వారి పాలనలేక పోతే హిందూదేశమేమయిపోతుందో అని వారి ఆందోళన!

పాశ్చాత్య నాగరికత ముఖ్యంగా పదార్థమతం (materialism) — ఇది ప్రతి మానవుణ్ణి సులువుగా ఆకర్షిస్తుంది. తాత్త్విక దృష్టితో చూస్తేనే కాని అది లోపల లొటారమని తేలదు. కాబట్టి అనేక మంది పాశ్చాత్య నాగరికతా విమోహితులవడమే కాకుండ, పదార్థమతంలో వెనకపడడంవల్ల హిందూ నాగరికతపై దానితో సమానం కాదనికూడ నిర సించేరు. ఇట్లు భారతీయ జీవితంలో వేరు వేరు ప్రవాహాలు ఎదుర్కొన్నాయి.

బ్రిటిష్ ప్రభుత్వంమీద అసహ్యం పుట్టాలంటే బ్రిటిష్‌వారి లోపాలను బైటపెట్టడం ఒక పని. పాశ్చాత్య నాగరికతలోని లోపాలను వెలువరిస్తూ, మనదేశపు ఘనతను ప్రకటించడం రెండోపని. బ్రిటిష్ రాజనీతిలోని అంతర్యాన్ని కాంగ్రెసు పదేపదే విప్పిచెప్పింది. అమెరికా బ్రహ్మచారిణి యైన మేయో 'మదర్ ఇండియా' అను గ్రంథాన్ని రచించింది. దానిలో మనజాతి గౌరవాన్ని పవాలు చేసే భాగాలు కొన్ని ఉన్నాయి. అందుమీదట కొందరు హిందూ ప్రముఖులు మిస్ మేయో గ్రంథాన్ని దుయ్యబట్టుకొన్నారు. కొందరు అమె రికాలోని సాంఘిక, ప్రభుత్వ జీవనంలోని కుళ్లును బైటికి ఎత్తేరు. మరి కొందరు హిందూ ఘనతను ప్రకటిస్తూ గ్రంథాలను రచించేరు. అట్టి వారిలో కొందరు-కన్హాయలాల్ గాబా, హరవిలాస్ శారదా, నటేశన్, కన్యాకన్నన్ అనువారు. ఇవన్నీ విమర్శ రచనలు. విమర్శ రచనలను రచించి తృప్తి పడవచ్చుకాని కళారచనను సృష్టించడం సామాన్యం కాదు. అందులోను ఉత్తమ కళను అందుకోడం మరీకష్టం. ఈ రకం రచనలు సాధారణంగా ఉత్తమ కళను అందుకోలేకపోడానికి ఒక ముఖ్య కారణ మేమిటంటే - గ్రంథకర్త సులువుగా ఒక పక్షానికి సంబంధించిన ప్రచారంలోకి దిగుతాడు. దానితో కళయొక్క గౌరవం పోతుంది. కాబట్టి ఈ రకం రచనను నిర్వహించడం సామాన్యులకు సాధ్యం కాదు.

రెండు భిన్న నాగరికతల సంఘటన దశలోని దేశస్థితిని, సంఘస్థితిని చిత్రించడానికి విశ్వనాథ సత్యనారాయణగారు పూనుకొన్నారు. చేయవల సినపని చిన్నది కాదు. ఒక వ్యక్తికి, ఒక ఊరికి, కొంచెం కాలానికి సంబంధించినది కాదు. ఆ నాటి ఆంధ్రదేశం, కుటుంబాల జీవితాలు, నవలలో చిత్రిం చాలి. ఇది భారీపనికాని సులువైనది కాదు. దేశీయ నాగరికతలోని సంప్రదాయాలు ఎట్టివి ?

పాశ్చాత్య నాగరికతను అనుసరించినవారు చేసేపనులు మంచివా, చెడ్డవా ? వారి జీవితాల పర్యవసాన మెట్లుంది ? సంప్రదాయమా, మార్పా ఏది మనకు

ఉపయోగం? మొదలైన క్లిష్టసమస్యలకు రూపు రేఖల నియ్యాలి.

సాంప్రదాయిక జీవితంలోని కొన్ని అంశాలు ఈ కిందివి. తలిదండ్రులు పెంచి బిడ్డలకు పెళ్లిళ్ళు చేయడం, సంతృప్తి జీవనం, దైవభక్తి, దేవదాసీలు, జాతీయవిద్య, ప్రాచీన గ్రంథాలు, పండగలు, పుష్కరాలు, దసరా వేడుకలు, కూచిపూడి భాగవతులు, మొక్కుబళ్లు, వూనడాలు, ఆయుర్వేద వైద్యం, ఆంబోతుల రక్షణ, గొఱ్ఱె పొట్టేళ్ల పందాలు, యక్షగానాలు, బొబ్బిలిపాట, దేవదాసీల నృత్యం, స్వామికి ఉత్సవాలు, పురాణపఠనం, యోగాభ్యాసాలు, అడివిలో వేట ఇత్యాదులు.

ఆధునిక జీవితంలోని కొన్ని అంశాలు - ధనాశ, ప్రేమచాంచల్యం, ప్రేమ పోటీలు, డబ్బు ఖూనీలు, ప్రేమ ఖూనీలు, లాలసత్వం, ఖర్చుతోకూడిన ఆంగ్ల కళాశాలావిద్య, మతంలో సంశయం, వేషభాషలు, రాజకీయపు పార్టీలు, ఎన్నికలలో పార్టీలు, మ్యునిసిపల్, తాలుకాబోర్డు ఎన్నికలు, వాటికి ధనవ్యయం, సర్కసు, దేశాంతరమందు ధనవ్యయం, రైళ్లు, మోటారులు, గుర్రపు పందాలు, పొలాలమీద తుపాకీవేట, మరబియ్యం, క్షయవ్యాధి, కుక్కపిల్లలను కొనడం, మద్యపానం, నోట్లసృష్టి, స్త్రీలు రంగస్థలంమీది కెక్కడం, అక్కడి విలాసాలు, విద్యుద్దీపాలు, కొళాయీలు, డబ్బు పంటలు, డాక్టర్ల బిల్లులు, మిషనరీల ప్రచారం, మన కళాఖండాల నష్టం, బస్తీ బ్రతుకులు మొదలైనవి.

మన సంప్రదాయాలలో పాతివ్రత్య మెంత ముఖ్యమో, సతీవ్రతమూ అంతే. దాని పర్యవసానమే ఏకపత్నీవ్రతం. ఈ ఆచారాన్ని భక్తితో పాటించిన కుటుంబాలలో భార్యా భర్తలమధ్య అవిచ్ఛిన్నమైన అనురాగం ప్రవహిస్తూంటుంది. మన శ్శాంతికొక ప్రధాన కారణం. ఈ సూత్రానికి నిదర్శనంగా అనేకమంది దంపతుల జీవితాలు నవలలో చిత్రించబడ్డాయి-అరుంధతీ ధర్మారావులు, శశిరేఖా కిరీటులు, అనసూయా పశుపతులు, హైమవతీ సూర్యనారాయణలు, నాంచారమ్మ, రాజేశ్వరుడు మొదలైనవారు, ఇంతేగాక ఈ నవలలో కొన్ని చక్కని ప్రేమకథలు, ప్రేమ ఘట్టాలు ఉన్నాయి. వాటిలో శశిరేఖా కిరీటులకథ ఒకటి.



సతీపతుల సమాగమము

ప్రేమలో నీతిని విడిచిపెట్టిన వారి బ్రతుకులు స్పష్టంగా చిత్రించబడ్డాయి. జోస్యుల భార్యయైన మంగమ్మకు ధనపిశాచి పట్టుకోగా రాజేశ్వరంతో చెడిపోయింది. తర్వాత నాటకవేషాలలోకి దిగింది. రాధాపతి చంచలమైన వలపుకి లోబడి ఘోరంగా బలిఅయ్యేడు. రంగారావు జమీందారు ఇల్లాలినీ

పోగొట్టుకొని, సుసానీ బియాట్రీసులను తెచ్చుకొని జమీందారీ దివాలా అయ్యేస్థితి, తాను అంతమయ్యే స్థితి తెచ్చుకొన్నాడు. పూర్వపు జమీందారులు సంప్రదాయాలలోని మంచిని గ్రహించి తాము సుఖపడి, ఒకరిని సుఖపెట్టేరు. రంగారావులోని లోపాలను గుర్తించి అతని కొమారుడు హరప్ప ఉత్తమ ప్రాచీన పద్ధతులను అనుసరించి జమీందారీని, తన తండ్రి జీవితాన్నికూడ రక్షించేడు. తనపని ముగియగా యోగరీతిని దేహయాత్రను చాలించేడు. ఇతను ఇంతటివాడవడానికి కారణం ధర్మారావు.

ఆధునిక జీవనంలోని అధికారానికి, ధనవ్యామోహానికి లోబడి రామేశ్వరం నీతిరహితంగా ప్రవర్తించి, నోట్లకేసులో చిక్కుకొని రూపుమాసేడు.

ఈ నవలలోని ప్రధాన వీరుడు ధర్మారావు. అతనికి జ్ఞానంవచ్చేటప్పటికి ఆస్తిపాస్తులు నశించేయి. ప్రేమవల్ల పడరాని కష్టాలు పడ్డాడు. కాని ఆదర్శాన్ని, ధర్మాన్ని ఏఘట్టంలోనూ విడిచిపెట్టలేదు. అతని దారిద్ర్యం అతని ప్రియభార్యను ఎత్తుకుపోయింది. విధి అట్లుంది!

ఈ నవలలో అనేక రకాల పాత్రలున్నాయి. శివరావు దేశభక్తుడేగాని దివ్యజ్ఞానం పిచ్చిలో ఉండిపోయేడు. రాఘవరావు పరిశుద్ధ దేశభక్తుడు. క్షయవ్యాధితో తీసుకొన్నాడు. జైలే స్వగృహం. రాధాపతి కనపడ్డవారివెంట కుక్కలాగు తిరిగి ధ్వంసమయేడు. వాడిని పోలిన చెంగల్రావు ఖూనీచేసి జైలుగోడలమధ్య చేరేడు. మంగమ్మ మాత్రం మేలుకొంది, వెనకటి వ్యాపారాలు కట్టిపెట్టింది. సన్మార్గానుసరణలోనే తుదముట్టింది.

అనేక పూర్వకావ్యాలలో వేశ్యను ఉత్తమ పాత్రగా హర్షిస్తారు. ఎందుచేత? దానిని తెలుసుకోవాలంటే ఈ నవలలోని గిరిక పాత్రను అర్థంచేసుకోవాలి. వేశ్య దేవదాసికాని వెలయాలు కాదు. ఆ సంప్రదాయాన్ని మరిచిపోయి ఆ కులంవారు చెడిపోయేరు. కాని ప్రాచీనధర్మాన్ని అనుసరించిన దేవదాసి దైవభక్తిని, నృత్యకళను ఒకటిచేసి, భగవంతుడిలో ఐక్యమయింది. దేవతగా వెలిసింది. ఈమె ధర్మారావు దిద్దిన పాత్ర.

గణాచారి ముందు విషయాలను చెప్పిపోతుంది. పసిరిక అనుపాత్ర రూపొందిన సాంప్రదాయిక వ్యవసాయం, నవీనపద్ధతులపేర వ్యవసాయమెట్లు ప్రమాదాలకు లోనవుతూందో నిరూపించబడింది. ఆధునిక విలాసాలపై పైమెరుగులు పూర్తిగా ప్రదర్శించబడ్డాయి.

ఈ నవలలో పెద్దపాత్రలెంత చక్కగా పోషించబడ్డాయో, చిన్న పాత్రలు, అట్లే చిత్రించబడ్డాయి.

వర్ణనలలో గ్రంథకర్త అసాధ్యుడు. ఎంతో సూక్ష్మంగాను, నిపుణంగాను వర్ణించడమేగాక, మధ్య మధ్య హాస్యంకూడ ఉంటుంది. వేణుగోపాలస్వామి ఉత్సవాల వర్ణనలు పెద్దవి. కాని అవి నూతనంగాను, నిపుణంగాను ఉన్నాయి. కవియొక్క గొప్పనేర్పుకి అదొక నిదర్శనం. అరుంధతి మరణాన్ని దీర్ఘంగా వర్ణించడం సబబే. కాని హరప్ప విషయం వేరు. కాబట్టి అతని మరణం రెండువాక్యాలలోనే చెప్పబడింది.

సంభాషణలు ఎంతదీర్ఘంగా ఉన్నా సహజంగాను, ఇంపుగాను ఉంటాయి. కవి ముందుకివచ్చి కనబడడు. మృదువైన హాస్యముంటుంది.

ధర్మారావు మళ్లీ పెళ్లి చేసుకొన్నప్పుడు చిన్నపిల్లను చేసుకొన్నాడు. కాని మన ప్రాచీన సంప్రదాయంలో స్త్రీపునర్వివాహసంస్థ లేకపోలేదు. కాబట్టి తత్సంబంధమైన వివాహం చేసికొని ఉంటే మెరుగుగా ఉండేది.

ఇదొక దీర్ఘప్రేమకథగాని, విచిత్రకథగాని కాదు. కాని దీనిలో ప్రేమోపాఖ్యానాలు, విచిత్రోపాఖ్యానాలు వచ్చి పోతూంటాయి. ఇది జ్ఞానరసప్రధానమైన గ్రంథం. చదువరులకు నూతనాభిప్రాయాల

నియ్యడం, ప్రాచీన సంస్థలలోని ఘనతను తెలియ చేయడం గ్రంథం యొక్క ఆశయం. ఇదొక (Sociological novel) సాంఘికోపదేశ నవల. అంత మాత్రం చేత కథాకల్పన నీరసించదు. చదువరులు ఈ నవలలో వచ్చే పాత్రలనుంచి, ఘట్టాలనుంచి తమ అభిప్రాయాలను మార్చుకొని, నూతన దృష్టిని అలవరుచుకొంటారు. ఇట్టి ఆశయం ఈ నవలది.

ఈనవల సులభశైలిలో ఉంది. ఆ కాలానికి ఇంకా వ్యవహారిక భాష అంతగా ప్రచారంలోకిరాలేదు. కాబట్టి దీనిలోని శైలి సులభగ్రాంథికం; అక్కడక్కడ సమాసరచన లేకపోలేదు. కాని ఏమూలో, ఎక్కడో!

ఈనవల మన సంఘాన్ని ప్రతిబింబిస్తూ ప్రాచీన సంప్రదాయాలలోని ఘనతను ప్రకటిస్తూంది. ఇది ఇచ్చే సందేశమిదే!

హిందూదేశంలో ఇతర భాషలవారు అనేకమంది హిందూ సంప్రదాయాల ఘనతను వ్యాసాలలో ప్రకటించేరు. ఉత్తమ కళలో చిత్రించిన అదృష్టం తెలుగుభాషకి దక్కింది. ఆధునికాంధ్ర వాఙ్మయంలో సాటిలేని గ్రంథాలలో ఇదొకటి. దీనిని ఇతర భాషలలోకి, ఆంగ్లభాషలోకి అనువదిస్తే పైవారికి, దీని యొక్క అపురూపత, ఆధిక్యతకూడ వెల్లడమవుతాయి. ఇట్టిఅద్భుతకళాఖండాన్ని సృష్టించిన గ్రంథకర్త స్తుతి పాత్రుడు.

# ధన్యజీవి

శ్రీ దాసరి వేంకట కృష్ణయ్య



[మొగలు బావుటా ఎగురుతూ రెపరెపలాడుతున్నది]

జిజియా:-ఏమీ ! యవన పతాకమా! ఓ నాడు భారతీయుల ఆధిపత్యంలో అత్యున్నత స్థానం అందుకున్న సింహగడదుర్గ శిఖరంపైనేనా యవనపతాక మెగరటం ? విజాతీయుల యినుపపాదాలక్రింద నలిగిపోయి, హీనస్వరంతో మూల్గుతున్నది భారతీయ సంస్కృతి. యవనస్పర్శకు 'అయ్యో ! అయ్యో !' అని వాపోతూన్నది భారత దేవాలయాల పవిత్రత. 'ఇక నాకు రక్షణలేదా !' అని జాలిగా విలపిస్తున్నది భారత నారీ హృదయం! వీటంతటికీ అదిగో ... ... ఆ ... ... పతాకమే ... ...

అంతర్వాణి:-జిజియా ! కానీ ... ఆలసించకు ... స్వధర్మాన్ని, స్వజాతిని రక్షించు ... యవన పైశాచికత్వానికి బలిఅయిపోతూన్న భారతి ఒరుల మానం కాపాడుకో ... జాత్యహంకారంతో యావద్భారత రాజ్యశక్తులనూ, ఎడమకాలి బ్రొటన వ్రేలితో నేలరాయ గమనిస్తూన్న యీ పచ్చి కిరాతకులనూ, యీ వాగురిలనుండి జాతిని కాపాడుకో ! అది నీ విద్యుక్త ధర్మం ... అదిగో ! అటుచూడు ! చిటచిట ధ్వనులతో నాల్కలు చాచుకొని మిన్నంటుతూ భారత సౌభాగ్య సౌశీల్యాలను కబళింప యవన దవాగ్ని జ్వాలలు ముందు కురుకుతున్నాయ్ ! ... ఆ భీకర దవానల శిఖల చల్లార్చు !

జి:-ఎవరక్కడ ?

దాసి:-అమ్మా ! ...

జి:-వెంటనే 'శివా'ను నా ఆజ్ఞగా ఇక్కడకు పిలువబంపు.

[కొన్ని క్షణాలు నిశ్శబ్దం, తర్వాత వస్తూన్న గుఱ్ఱపు డెక్కల చప్పుడు. ఉన్న కొద్దీ చప్పుడు ఎక్కువవుతుంది]

[శివాజీ గుఱ్ఱం దిగి]

శివాజీ:-అమ్మా ! ఇడుగో నీ శిశువు ! ఆజ్ఞ ఏమిటో శెలవీతల్లీ ! నెరవేర్చుటకు సంసిద్ధుడను.

జి:-నాయనా శివా ! వేరే రాచకార్యమేమీ లేదు. ఉబుసుపోక చదరంగమాడుటకు పిలువనంపాను.

[శివాజి చదరంగపు కాయల నమర్చును]

జి:-(చిరునవ్వుతో) శివా !ఆట ప్రారంభించేముందు ఒకమాట. ఈ ఆటలో నీవు ఓడిపోయిన పక్షంలో పందెము ఒక దుర్గాన్ని యివ్వాలి సుమా !

శి:-అమ్మా ! ఒక దుర్గమే యననేల ? ఈ రాజ్యమంతా నీది కాదా ? లోకమాతవగు నీ వధికారం వహిస్తానంటే కాదనేవారెవ్వరు ? కాకుంటే నేను పేరుకు కిరీటం ధరించిన రాజప్రతినిధిని మాత్రమే కదా ! ... ఇదిగో ! రాజంగుళీయకం ... ఇకపై నీవే రాజ్యరథాన్ని నడిపింపు ... !

జి:-అబలకు అఖండ సామ్రాజ్య ప్రదానమా ! నాయనా ! వద్దు ! వద్దు ! నాకా సార్వభౌమ

త్వమూ, సామ్రాజ్యమూవద్దు. నేను చదరంగపు క్రీడలో గెలిచిన, ఒక దుర్గమిచ్చినచాలు ...

[చదరంగపు ఆట ప్రారంభమైంది. పాచికలు గబగబ వేస్తున్నారు]

(కొద్దిక్షణాలు ఈ విధంగా జరుగుతుంది)

జీ:-శకటు కొట్టి రాజు......నాదీ గెలుపు.

శి:-అ......

జీ:-మరి శివా! నాకిచ్చిన వాగ్దానం?

శి:-ఏమిటీ వాగ్దానం? దుర్గమేనా?

జీ:-అ...దుర్గం......సింహగడదుర్గం!

శి:-ఆ! సింహగడ దుర్గమా!

జీ:-ఏం! సింహగడ దుర్గం మన అధీనమందు లేదని యేనా నీ సంశయం? (కొద్దిక్షణాలు ఆగి) ఆ విష యం నాకు తెలియందికాదు........కాని అమా యకులైన సింహగడ్ ప్రజల ప్రాణాలు అటు మొగలు దౌర్జన్యాలకూ, ఇటు ఉదయ భానుని అమానుషాలకూ సహించలేక అడకత్తెరలో పోక లావున్నాయి. మృత్యుదేవత కహకహ నవ్వుతూ వికటాట్టహాసం చేస్తూంది. ఆదుర్గంలో అధర్మం, అరాజకం, అధికారం చలాయిస్తున్నాయి. ఆ కోటలో హిందూ మాన ప్రాణాలను పందెమొడ్డి జూదమాడుతూన్న యవనులకు బుద్ధిచెప్పి భారత దేశక్లేశాన్ని తొలగించు అధర్మాన్ని, అమానుష త్వాన్నీ అంతరింపజేసి శాంతి సౌమనస్యాలను పెంపొందింపచేయటానికి ముందుకుదూకు. శివా! ఇక జాప్యం చేయటం తగదు. ప్రజానీకాన్ని రక్షించు.

శి:-అమ్మా! సింహగడ ప్రజల ఆర్తనాదాలు నే వినక పోలేదు. ఉదయభానుని కిరాత కృత్యాలు తెలియకపోలేదు...చారుల మూలకంగా సర్వమూ నాకు తెలుస్తూనేవుంది ... కాని సింహగడను జయించటం మాటలమీద లేదు. రణవిద్యాపారంగ తుడైన ఉదయభానుడు దుర్గాధిపతి. రణ విద్యలో అరితేరిన ఆఫ్గన్ వీరులు, అపార రాజపుత్ర సైన్యమూ ఆ దుర్గానికి రక్షణ. అలాంటి పరిస్థితులలో మన స్వల్ప సైన్యంతో దురాక్రమణకు పూనుకోవటం కేవలం సాహస కార్యమేమో!

జీ:-శివా! ఏమిటీ వెలితిమాటలు? ... పిరికితన మంటే ఏమిటో తెలియని శివుడేనా అకర్మణ్యుని లాగా అధైర్యపడి మాటాడటం ... ఈ నా రెండు హస్తాలతో ఏ శిశువునకు ఉగ్గుపాలతో పౌరుషాన్ని రంగరించి పోశానో ఆ శిశువువేనా వెనుకాడటం?

శి: (శరీరం సమరావేశంతో ఉప్పొంగిపోతుంది.) అమ్మా! వెనుకాడి నేనామాటలనలేదు. ముల్లో కాలు ఎదురై సవాలుచేసినా, ప్రళయకాలపు రుద్రుని రౌద్రజ్వాలలు నన్ను నఖశిఖ పర్యంతమూ దహించివేసినా, మృత్యుదేవత విలయతాండవం చేస్తూ తన కరాళ దంష్ట్రికలతో నన్ను కబళింప వచ్చినా ఈ శివుడు జంకడు ... కోటను పట్టు కొనేముందు కొంత బాగోగులు యోచించటం భావ్యమని తలచాను! కాని భయపడిమాత్రం కాదు.

జీ:-నాయనా! శివా! నీ ధైర్య స్థైర్యాలు నాకు తెలియనివికావు. నీపై నాకు ధృడవిశ్వాసముంది. కనుకనే నీకోసం కబురంపాను. నీవే ఈ కార్య భారాన్ని వహింప సమర్థుడవు ... సింహగడ దుర్గాగ్రంపై మన అరుణపతాకం విజయదీప్తితో ఎగురుతూంటే కన్నుల పండువుగా చూచే భాగ్యం కలిగించు.

శి:-అమ్మా! నీ ఆజ్ఞానుసారం సింహగడ దుర్గా క్రమణకు సర్వసన్నాహాలూ గావిస్తాను ... ఈ

మహత్కార్యంలో విజయం లభించునట్లు ఆశీర్వదించు తల్లీ!

[వెంటనే విజయసూచకంగా నగరి మొగసాలలో నగారానే భత్తులు మ్రోగుతవి]

జి: అలాగే-వెళ్ళి విజయశ్రీతో తిరిగి రా నాయనా!

[గుఱ్ఱపు డెక్కల చప్పుడు - ఉన్నకొద్దీ తగ్గిపోతుంది]

(కొన్ని క్షణాల తర్వాత)

సైనికులు:-జై! శివాజీ మహరాజ్ కీ జై! ... ...

(శివాజీవచ్చి సింహాసనముమీద కూర్చున్న మీదట)

శి:-సింహగడ దుర్గాన్ని జయింప ముందుకు రాగల ధీరులెవేరు?

(సభంతా నిశ్శబ్దం)

శి:-ఏమీ సింహగడను పట్టుకొన సాహసించే వీరుడేలేడా ...

తానాజీ:-లేకేమి ప్రభూ! (కంఠం ఖంగున మ్రోగునట్లు చెప్పును.)

శి:-ఎవరా మేటి సర్దారుడు? ఎవరా ముందు కురికిన సాహసికుడు? ఎవరూ! తానాజీయా! ఛత్రపతి కుడిభుజమా! అవును! నీవుగాక ఈ మహత్తర కార్యభారాన్ని వహించు సర్దారుడేడీ? సింహగడను ఢీకొనజాలిన సింగము నీవే! నీకు నీవేసాటి.

తా:-(గంభీరంగా సభాభవనం కంపించేటట్టు) ప్రభూ! ఈ స్వల్ప కార్యమునకు మీరింత ఆలోచింపవలయునా? మీ శెలవయ్యేనేని సింహగడ దుర్గమును ఈ క్షణమున మీ పాదాక్రాంతము చేయనా! యవనకేతువును తెగిచి సింహగడలో విజయదుందుభులు మ్రోయింపనా! మీరు 'ఊ' అన్నంత మాత్రాన ఊర్వినంతటినీ వుగ్రూతలూగించి వేయగల మాళవ వీరభటులుండ సింహగడ లెక్కా?

శి:-తానా! నీ హృదయం నాకు తెలియందికాదు. నీ పౌరుషం లోకానికి కొత్తగాదు. నాకు అండగానిల్చి ఎన్నో భయంకర రణరంగాలలో నీవు చూపిన అకలంక శౌర్యము నేనింతలో మరువగలనా! శత్రుచమూ దళములకు గుండెగాలమయి నీవు కత్తిబట్టి వీరోచిత పోరాటములు సల్పిన నాటి దృశ్యములు యింతలో విస్మరించగలనా! కాని నీ ప్రియ సుతుని పెండ్లివేడుక నేటి కయిదుండ నిన్ను సమరభూమికి పంపిన నన్ను లోకం నిందించదా?

తా:-ప్రభూ! దేశకల్యాణముకన్న నాకు కావలసినదేమిటి? ఈ నా శరీరం పవిత్రమాతృదేవి పాదపద్మాలచెంత కాన్కగా అర్పించబడుటకంటే కోరదగినదేమిటి? మాతృమందిర ప్రాంగణంలో నా హృదయం ఒక దీపి కళికయై వెలుగుటకన్న వాంఛింపదగినదేమిటి? ప్రభూ! నా చిరకాల వాంఛితము ... ఇక సెలవిప్పించండి. భవానీ మాత కరుణాకటాక్షమున్న విజయశ్రీతో తిరిగి వస్తాను ... లేదా నా కుమారుడికి సర్వమూ మీరే ... వాని బాషికముగూడ మీరే జరిపించండి. ప్రభూ! నేటి కైదవనాటి రాత్రి సింహగడ దుర్గంపై వెలుగు కనిపించెనేని మిమ్ము విజయశ్రీ వరించెనని భావింపుడు.

(సభలో జయజయ ధ్వానాలు)

శి:-(సింహాసనం దిగుతూ -) అన్నా! తానా! నిక్కమైన మొగసిరి వీరుడవన్న నీవే! ఈ కార్యమును విజయములో స్సాధింపగల సమర్థ

డవు నీవే. నీవు సమరమునకు వెడలితివన్న విజయ సంపద మన గృహమునకు వలసవచ్చినట్లే!

తా:-ప్రభూ! మీదాసుని మీరింత అగ్గించుట తగదు. ఇది నా విధ్యుక్తధర్మం...... దేశభక్తునికి సమర భూమియే స్వర్గసీమ! అగ్ని పర్వతమే ఆటబంతి! కవోష్ణవైరిరుధిరమే వీరగంధము! ప్రభూ! సెల విప్పించండి. మీ తానాజీ కత్తి బట్టిన వట్టిచేతులతో రాబోడు-జోహార్!

(ఆ తరువాత-మసక వెలుగులో పొదలోకి జారబడే కృష్ణ సర్పాలకు మల్లే జలజలా ప్రవహిస్తున్నాయి సెలయేళ్లు. ప్రకృతి మూలుగు లాగా 'హుం హుమ్మ'ని పడమటిగాలి వీస్తూంది. కీచురాయిఫిట్టల అరుపులు, గుడ్లగూబల కూతలు, నక్కల అరుపులు ...దీనివెనుక వస్తున్న గుఱ్ఱపుడెక్కల చప్పుడు ఎక్కువవుతూంది.)

తా:-(ఆగి) కాళికా! ఇది నీకూ, నాకూ గూడా పరీక్ష సమయం. ఇంతవరకు ఎన్నెన్నో కోటలు పట్టు కోటంలో సాయపడ్డావు. ఎన్నో విజయాలకు కారకురాలివయ్యావు. ఈ నాడు శివప్రభువు మన భుజస్కంధాలపైన మోపిన మహత్తర కార్యాన్ని సాధించడంలో నీవూ సాయపడాలి. నీసాయమున్న కార్యంలో విజయం తప్పక లభిస్తుంది. ఏమంటావ్ — అవును — నాకు తెలుసు— నీశక్తి నాకు కొత్తకాదు. ఈ నాడు విజయం తప్పదు!!

(కోట పైకి ఉడుమును విసిరిన చప్పుడయింది.)

సై:-ఒరేయ్! పట్టు పట్టలేదురా ఉడుం!

2వ||:-ఇదేదో అశుభసూచకంరా.

తా:-ష్...మీరరవకండి...(కాళికను చేతికి తీసుకొని) కాళికా! ఏమిటిది? వెనుకంజ వేయటం వీరోచిత లక్షణమా! ఈ సమయంలో కంట నీరు పెట్టటం కానిపని సుమా!-ఆ! ఏమంటున్నావ్; నాకు ప్రాణహాని అని వెరుస్తున్నావా! పిచ్చికాళిక! ప్రభుకార్య తత్పరుడనైన నాకు ప్రాణాలొక లెక్కా! నాప్రాణాలొడ్డి అయినా సరే మనప్రభు ఆదేశాన్ని పాలించాలి. కానీ! ఆలసించకు! కోటపైకి వెళ్లు.

(మళ్ళా కోటపైకి విసిరిన శబ్దం)

(కొద్దిక్షణాలు మేకులుకొట్టిన శబ్దం, తాళ్ళు విసిరిన చప్పుడయింది)

తా:-ఊ...త్వరగా...త్వరగా...మీరు అటువైపు పొండి...

[కోటపైకెక్కుతున్న సైనికుని ఒర నుండి కత్తిజారి క్రింద పడ్డశబ్దం]

మొగలులు:-(దూరాన్నించి) ఆరే! అయారే మావళీకాదండ్! పకడో! పకడో!...

మావళీలు:-హరహర మహాదేవ్!......

[దూరాన్నించి మొగలులు 'అరే హల్లా!' అని ఆర్తనాదం]

మొ:-మహారాజ్! మావళీ సైన్యంతో తానాజీ ఆయా హై! హంతా గడ్ బిడ్ చేసీ పారేస్తున్నాడ్.

ఉదయభానుడు:-ఇంత మితిమీరిపోయెనా తానాజీ! ... ఎవరక్కడ? యుద్ధానికీ సర్వ సన్నద్ధం చేయించు.

(రణభేరి మ్రోగిన శబ్దం)

(దూరంగా మావళీలు 'జై! జై! శివాజీ!' అంటూంటారు. తానాజీ, ఉదయభానుడు ఒకరిపై

నౌకరు తారసిల్లుతారు. ఖడ్గాల ఖణఖణ ధ్వనులు. ఒక ఖడ్గంతో గట్టిగా కొట్టిన శబ్దం. ఉదయభానుడు 'హా! హా!' అంటూనే నేలకూలి మరణిస్తాడు.)

(ఇది గమనిస్తున్న మొగలు సిపాయి బాకు విసరును.)

తా:-ఆ! అబ్బా ... !

సూర్యాజీ:-అన్నా ... !

తా:-మీరు వెనుకాడవద్దు! మొగలుల హాతమార్చి మరీ శివాజీని చూడండి!

మావళీశిపాయి 1 :-పదరా ... శివాజీ ప్రభువు దగ్గరకు ...

,, 2 :-ఇంకా ఏమొగం పెట్టుకొని పోదాంరా? అదిగో ఆయన యేదో అరుస్తున్నాడురా — ఎవరదీ ... సూర్యాజీ!... తానాజీ తమ్ముడు.

సూ:-సైనికులారా! ఆగండి! పారిపోకండి! పిరికి పందలలాగా పగరకు వెన్నిచ్చి పారిపోవటం పౌరుషలక్షణంకాదు. ఈ బొందెలో ప్రాపిరున్నంతవరకు దేశంకోసం - జాతికోసం పోరాడటమే వీరచిహ్నం ... మన నాయకుని భౌతిక దేహాన్ని రణమధ్యంలో విడిచిపెట్టి పారిపోవటానికి మీకు మనసెలా వచ్చింది? వీరనాయకుడు తానాజీ ఆత్మకు శాంతికలగాలంటే ఆయన చేపట్టిన కార్యాన్ని విజయవంతంచేయడమే మన కర్తవ్యం.... రండి ... రణభూమియందుండండి!

(మళ్లీ సైనికుల కోలాహలం; కరవాలాల చప్పుడు)

మొ:-రే! బాబా! మాఫ్‌కజియే! ... సింహగడ్ తుమ్హారా హై!

(విజయదుందుభులు మ్రోగిన శబ్దం)

(గుఱ్ఱంవస్తున్న చప్పుడు)

మావ:-ప్రభూ! శివాజీ మహారాజ్ వస్తున్నారు.

శి-:(గుఱ్ఱందిగి) తానా! తానా!

సూ: ప్రభూ! జయలక్ష్మినిగొన్న కదనసింగము... అదిగో (పల్లకీ చూపాడు)

శి:-అన్నా! తానా! నీవులేనిదే నాకీ దుర్గమెందుకు? సింహగడలో గడం మాత్రం లభించింది. కాని సింహాన్ని మాత్రం కోల్పోయాను. చేతులార రణభూమికిపంపి నిన్ను చంపుకొన్న నన్ను ప్రపంచం నిందించదా? అయ్యో! ఇంతలో నాకు దూరమవుదువని కలలోకూడా అనుకోలేదుకదా! నీ కుమారుని బాషికము నీ సమక్షములో జరుపగలవనుకొంటినే! ధర్మోద్ధరణకోసం దేహాన్ని అర్పించావే! ఛత్రపతి శివాజీ మహరాజ్ కుడిభుజం కూలిపోయెనే ... !

(శివాజీ కంఠం గద్గదికమవుతుంది. సమీపంలో వున్న గుడ్లగూబ వికృతంగా కూస్తుంది - ఆ విషాదాంతానికి భరతవాక్యంగా.)



# 'నా చిన్ననాటి ముచ్చట్లు'

'ఆంధ్ర మహిళ' అభిప్రాయం.

కీ. శే. డాక్టరు కే. ఎన్ కేసరిగారు తమ చిన్ననాటి ముచ్చట్లు అని వారి జీవితగాథను సంగ్రహంగా లిఖించేరు. ఇందులో వారు చిన్ననాటి పేదరికమువల్ల పడ్డ అష్టకష్టాలను, ఆపై వారు పొందిన ప్రతిష్టనే కాకుండా ఆ రోజులలో మనవారిలో ఉండే మూఢనమ్మకాలు, మూర్ఖపద్ధతులు, నాటు వైద్యం, చెన్నపట్నంలో ఆంధ్రుల జీవిత విశేషాలు మొదలైన ఘట్టాలన్నీ కూడ అతి సులభశైలిలో, మధురభాషలో చదువరుల కండ్లకు కట్టినట్లు అతిరమ్యంగా వర్ణించేరు. సాధారణంగా కేసరిగారివలె దుర్భర దారిద్ర్య మనుభవించి, ఆపిమ్మట అష్టఐశ్వర్యములు అనుభవించుచూ పూర్వానుభవాలను జ్ఞప్తికి తెచ్చుకునే వ్యక్తులు చాలా అరుదు. డాక్టరు గారు వారి వెనుకటి చరిత్రఅంతా హృదయ రంజకంగా చిత్రించి అనేక మందికి మార్గదర్శకులు గావటంలో ఉంది ప్రతిభఅంతాను.'

వారు స్వశక్తిచే ధనమార్జించి బీదలకు ముఖ్యంగా స్త్రీలోకానికి వారుచేసిన సేవ అపారం. ఆంధ్ర నారీలోకాని కంతకూ వారి 'గృహలక్ష్మి' 'లోధ్ర' ఇత్యాదులు చేస్తున్న సేవ సర్వజనవిదితమే. ఇటువంటి ఆదర్శ ప్రాయుల యొక్క జీవితపు చరిత్ర ప్రతివ్యక్తి కూడ చదివి అనుకరించ వలసినదే. ముఖ్యంగా ఈ రోజులలో నిరుద్యోగ సమస్యతో తారుమారవు తున్న యువకులంతా కేసరిగారివలె స్వశక్తితో జీవనోపాధి యేర్పరుచు కోవడం నేర్చుకోవాలి. పెద్దలు 'ఉపాయంవుంటే వూళ్ళేలవచ్చు' నని సామెత చెప్పేరు. డాక్టరు కేసరిగారు అమరజీవులు.

ఈ గ్రంథములో అనేక అమూల్య విషయాలున్నాయి. పుస్తకం గెటప్ కూడ చాలబాగుంది.




# చిట్టి ఆలోచనలు

శ్రీ చక్రవర్తి రంగస్వామి

నాన్న

ఆరుబయట పక్కమీద
వెన్నెలలో వెల్లకిలా
పండుకొన్న చిట్టిబాబు
ఏమిటోయి ఆలోచన ?

చిట్టిబాబు

ఆకాశంలో ఆడుతున్న
చందమామ
చుక్కలతో ఆడుతున్న
చందమామ
కాళ్లులేని చందమామ
కిందికిదిగి రాలేడా ?

నేనుగూడ

చందమామ సావాసం
చేయాలేమరి—
ఏదైన ఉపాయం
ఆలోచిస్తున్నా, నాన్నా !

పెద్దగడా, మనకుర్చీ
తెచ్చిపెట్టు, లే, నాన్నా !
కుర్చీపై కెక్కి నేను
గడతీసుక చందమామ
రాలగొట్టి తీసికొనీ
ఆడుకొంటూ పాడుకొంటా !

రాలగొట్టటంలో
బావిలోకి పడిపోతే !
బొక్కెనతో పైకిచేది
అందుకొనీ, తీసికొనీ
ఆడుకొంటూ పాడుకొంటా ! !

తెచ్చిపెట్టు, లే, నాన్నా !
పెద్దగడా, మన కుర్చీ ! !

# చంపావతి

## శ్రీ పిల్లా సుబ్బారావుశాస్త్రి

అక్బర్ పాదూషాకి ఎందరో రాజపుత్రవీరులు లొంగిపోయి ఆయనకు బానిసలయ్యారు. కాని మహారాణాప్రతాప్ మాత్రం ఆయనకు లొంగలేదు.

అక్బర్ పాదూషా ప్రతాప్‌ను, అతని భార్యాబిడ్డలను ఎన్నో బాధలను పెట్టాడు. కాని లాభం శూన్యం. చివరికి రాణా అడవులు పట్టేడు - ఒక నాడు అతని భార్య సుగుణాంబని, కుమార్తె పదకొండేళ్ళ చంపావతిని కొడుకు సుందరసింగును తీసుకొని రహస్యంగా అడవులకి పారిపోయాడు.

రాణా ఆ అడవుల్లో అడవిపళ్ళని తింటూ కాలం గడపసాగాడు. ఏనాటికయినా అక్బర్‌ని జయించాలనుకున్నాడు.

ఒకనాడు భార్యతో "దేవీ! చూశావా మన గడ్డురోజులు! ఈరోజు ఒక బ్రాహ్మణుడు అతిథిగా రాగా తిండిపెట్టలేకపోయాను! జీవితంలో అతిథిరాగానే లేదనిపంపినరోజు యిదే! - నేను మన పిల్లలు ఆకలితో అలమటించిన నాడుకూడా యింత విచారించలేదు! నేను మన వంశ గౌరవాన్నే మంట గలిపాను!" అంటూ దుఃఖించాడు రాణా.

"ఎందుకు ఏడుస్తున్నావు నాన్నా! నేను ఆయనకి ఫలహారం పెడుతున్నానుగా! ... ఆయన స్నానానికి వెళ్ళారు! నీవు ఏడవకు!" అన్నది పరుగునవచ్చి చంపావతి.

"ఆఁ ...! బ్రాహ్మణుడికి భోజనం పెడుతున్నావా ...? చిట్టితల్లీ! మనవంశ గౌరవాన్ని నిలబెట్టావు! ... ఇంతకీ ఎలా పెడతావు?" అంటూ చంపని దగ్గరికి తీసుకున్నాడు రాణా.

"మీరు రోజూ నాకు యిస్తున్న రొట్టెలని తినటం లేదు! వాటి నన్నిటినీ ఆకులో పెట్టాను! - బయట చెట్టు ఆకులు తీసుకువచ్చి పచ్చడిచేశాను!" అని చంపావతి అనగానే ఆయన కళ్ళవెంట బొట బొట నీళ్ళుకారేయ్!

తర్వాత చంపావతి ఆయనకి విస్తరివేసి రొట్టెలు పెట్టింది. "మంచి పదార్థాలు పెట్టలేనందుకు క్షమించండి!" అంది చంపావతి బ్రాహ్మణుడితో.

ఆ అతిథి "ఫర్వాలేదమ్మా! నేను యిటువంటి భోజనం ఎన్నడూ ఎరుగను!" అంటూ తిని చంపని దీవించి వెళ్ళిపోయాడు.

చంపావతి అతిథిని పంపేసి ఎంతో ఆనందంగా తండ్రి దగ్గరికి పరిగెత్తింది. కాని మూడురోజులనుండి తిండిలేకపోవడం మూలాన స్పృహతప్పి పడిపోయింది.

ఆమెకి సపరిచర్యలు చేస్తున్న రాణా దగ్గరికి కొందరు భటులు వచ్చేరు. "ఏమిటండి!" అని అడిగింది భర్తని సుగుణాంబ.

"అక్బర్ చక్రవర్తి రాజీకి రమ్మన్నాడు!" అన్నాడు రాణా.

"వద్దు నాన్నా! ఈరోజు రాజీకి రమ్మంటాడు! రేపు బానిసగా జేసుకుంటాడు! మన రాజపుత్ర వీరులం! ఆయనతో రాజీపడకు నాన్నా మనం యేనాటికి అక్బర్‌కి లొంగవద్దు!" అంటూ కేకవేసి శాశ్వతంగా నిద్రపోయింది చంపావతి.

"లొంగనమ్మా! అక్బర్‌కి లొంగను!" అన్నాడు రాణా.

"వద్దు! నీవు ఆయనకి లొంగక్కర్లేదు ...!" అంటూ ఇదివరకటి అతిథివచ్చి "రాణా! నన్ను క్షమించు! చంపావతిని నిష్కారణంగా పొట్టన బెట్టుకున్నాను!" అంటూ అక్బరు (అతిథి) క్షమాపణ కోరేడు.

అక్బర్ ఆయన రాజ్యం ఆయనకిచ్చేశాడు. కాని యీనాటికి చంపావతిని మనం మరువలేము. ఆమె పేరు చరిత్రలో సువర్ణాక్షరాల్తో నేటికీ చెక్కబడి వుంది.




**ఉపాధ్యాయ : అన్నపర్తి సీతారామాంజనేయులుగారు. సాహితీఆర్ట్సు ప్రచురణ, గుంటూరు. వెల 0-12-0**

ఇది చిన్న నాటిక. ఇందులో దేశం మొత్తంమీద నావరించుచున్న అవినీతి, అన్యాయాలు, స్వార్థపరత్వము మొదలగు విషయాలకు న్యాయము, నీతినియమములు, స్వార్థరహితమైన సేవకుగల సంఘర్షణ, దాని ఫలితంగా నలిగిపోతున్న వారి స్థితిగతులను గ్రంథకర్త స్వానుభవంతో చిత్రించాడు. ఇట్టి సాంఘిక దుస్థితినుండి విమోచనాన్ని గ్రంథకర్త నిర్దుష్టంగా సూచించకపోయినా పాఠకులకు, పాటకప్రేక్షకులకు ఆ బాధ్యతను వదలియుండవచ్చును.

ఇందలిపాత్రపోషణ తృప్తికరముగానున్నదని చెప్పవచ్చును. సంభాషణలు మొత్తముమీద సరళంగాను, చమత్కారంగానున్నవి. ఈ నాటకము ప్రజల ఆదరాభిమానములకు పాత్రముకాగలదనియు, నాటకప్రేక్షకులయొక్కయు, పాఠకుల ప్రోత్సాహంతో మరింత ప్రజోపయుక్తమగు రచనలను గ్రంథకర్త చేయగలడని మా నమ్మకం.

**ఖండకృతి : జాస్తి వేంకట నరసయ్యగారు, చిలకలూరిపేట, గుంటూరు జిల్లా, వెల 0-8-0**

ఇది ముప్పదిరెండు శీర్షికలతో రూపొందిన ఖండకావ్య సంపుటి. ముచ్చటగానుండి నిరాడంబరంగా సాధారణ ప్రజానీకం సయితం చదివి ఆనందించగలదిగా నున్నది. ఇందలి భావాలు సుబోధకంగాను, ఉత్తేజపరచునవిగాను, కవిత్వము అనర్గళంగాను, భాషసరళంగానుండి దేశభాషాభిమానమును, లౌకికవిజ్ఞాన సంపత్తిని పెంపొందించునవిగా నున్నవి.

**బీనాకిషోర్ : యం. యస్. తేజ్‌కుమార్‌గారు- సీతారామాంజనేయ ఆశ్రమం, పిఠాపురం, తూ. గోదావరిజిల్లా. వెల 0-8-0**

దీనిని గ్రంథకర్త సాంఘిక నాటికగా నామకరణం చేశాడు.

బీనా, కిషోర్‌లు యిందులో ఒకరికొకరు ఆత్మార్పణముచేసినవారు. కాలేజి విద్యార్థులలో క్రమశిక్షణ, పద్ధతిలేని పరిస్థితులు, ముఖ్యంగా కాలేజి విద్యార్థుల వెర్రివేషాలు, వాని ఫలితంగా యీ నాటకంలో అధ్యాపకురాలు, బీనాలాంటి స్త్రీలు పడుతున్న బాధలు, విషాద ఫలితాలు చిత్రించడం గ్రంథకర్త ఉద్దేశమయి యుండాలి.

భాషయొక్క పొందిక చెప్పుకోతగినంతగా లేకపోయినా యిది కాలేజీలలో, ఉన్నత పాఠశాలలో మాత్రము ప్రదర్శన యోగ్యమైనది. ఇందులో ఆంగ్లపదాలవాడుక విశేషంగా నుండుటచే జనసామాన్యానికి దీని ప్రదర్శన అంతగా రక్తి గట్టదేమో!



# సంపాదకీయములు

## పేదరికం, అవిద్య సమస్యల పరిష్కార మార్గం

ఈనాడు భారత సమాజాన్ని సవాలు చేస్తున్న సమస్యలు పేదరికం, అవిద్య, మురికిపేటలలోని జీవితమని శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు యీ మధ్య గుంటూరులో నుపన్యసిస్తూ చెప్పారు. అదే సందర్భమున వారు దురదృష్టవంతుల సౌఖ్యసంతోషాలకు అనేక విధాల సాంఘిక సేవాసంఘాలు కృషి చేయవచ్చుననియు, కాలేజీలలో విద్యనభ్యసించుచున్న విద్యార్థులు తమకు లభ్యమైన విద్య, విజ్ఞానావకాశములను నిర్భాగ్యులు, దురదృష్టవంతులయొక్క దీనావస్థను చక్కదిద్దుటకు వినియోగించి పతనావస్థలోనున్న సాంఘిక పరిస్థితులను ఉద్ధరించుటకు ప్రజలు, సేవాసంఘాలు కృషిచెయ్యాలని అంటూ దురదృష్టవంతుల జనాభ లెక్కలను తీసికొని వారికేవిధంగా సహాయము చేయవచ్చునో విద్యార్థినులాలోచించాలని ఉద్బోధించారు.— అంతవరకు బాగానేయుంది; కాని అదే సందర్భమున యీ సమస్యను ప్రభుత్వము చేబట్ట సాధ్యముకాదనియు, ప్రభుత్వానికింకా ఎన్నో సమస్యలున్నవనియు, అనధికార సంఘాలే యీ సమస్యలను చేబట్టి పరిష్కరించాలనడం శోచనీయము.

అదృష్టవంతులు దురదృష్టవంతులకు సహాయముచేసి ప్రజలు తమంతట తామే పేదరికం, అవిద్య, మురికిపేటలలోని జీవితములాంటి సమస్యలను పరిష్కరించుకోగల మానసిక పరివర్తనము కలిగిననాడు అంతకంటె కావలసింది మరేమియునుండదు.

ఇక అనధికార సంఘాల నిర్వహణలోని అవకతవకలు, అసమర్థతలాంటివి దౌర్భాగ్యుల సౌఖ్యసంతోషాలకు జరుపకలిగే కృషి బహుస్వల్పం. ఇక విద్యార్థులు, విద్యార్థినులు ఆసక్తితో సంఘసేవ చేయనుద్యుక్తులైనా, పరిమిత కాలంలో, ఆర్థికవసతుల లోపంతో చేయగలిగింది అంతగానుండదు. ఇక అనధికార సంఘాలుగాని, విద్యార్థులుకాని చేయకలిగిందేమిటంటే — ఉన్న అవకాశాలను వినియోగించి ప్రజలలో ప్రచారంచేసి దురదృష్టవంతుల పట్ల సానుభూతి సద్భావాలను ప్రోత్సహించగలరు; విద్య, విజ్ఞానముల వ్యాప్తికి కొంత కృషిచేయగలరు. అంతేగాని అవిద్య, పేదరికం, మురికిపేటలలోని జీవితం లాంటి సమస్యల పరిష్కారానికి వలసిన ఆర్థికవసతులను సమకూర్చుకొని నిర్వహించగలరనడం బలీయమైన వాదమనిపించుకోదు. అందుకు ప్రభుత్వమే పూనుకోవాలి. ప్రజల ఆరోగ్య సౌభాగ్యాలకంటె ప్రధాన సమస్యలు ప్రభుత్వమునకున్నవనడం కాని, వానిని చేబట్టడం ప్రభుత్వానికి సాధ్యము కాదనడంగాని సమంజసం కానేరదు. ప్రజల సహకార సద్భావములతో ప్రభుత్వము ప్రజలప్రధానావసరాలకు సంబంధించిన సమస్యలను చేబట్టి పరిష్కారాన్ని సాధించాలి.

## సానుభూతి

ప్రఖ్యాత ఆంధ్రరచయిత్రి, గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీత శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికి భర్తృవియోగ సందర్భమున మాసంతాపాన్ని తెలియజేయుచున్నాము.

ఇదే సందర్భమున ఆంధ్ర భాషా పోషకులుగా పేరెన్నికగన్నట్టియు, చిరకాలంగా మా 'గృహలక్ష్మి' పట్ల విశేష ఆదరాభిమానములు కలిగియుంటూ వచ్చిన శ్రీ బులుసు బుచ్చి సర్వారాయుడుగారు కాలధర్మం చెందిన సందర్భమున వారి పెద్దకుమారులు - ఆంధ్ర విద్యాశాఖామాత్యులు శ్రీ పట్టాభిరామారావుగారికి, వారికుటుంబానికి మా సానుభూతి సంతాపాలను తెలుపుచున్నాము.

## శ్రీ జయనామ సం॥ర ఆశ్వయుజ - కార్తీకమాసములు

| | | | |
|---|---|---|---|
| 1954 సం॥ అక్టోబరు నెల | 16 | శ | పం 42-25 రో 17.58 రా 1.50 అమృతసిద్ధయోగం |
| | 17 | ఆ | ష. 37-13 మృ 14.17 రా 5.3 |
| | 18 | సో | స 32.55 ఆర్ద్ర 11.22 రా 11.14 |
| | 19 | మం | అ 29.40 పున 9.25 దివ 29.12 |
| | 20 | బు | న 27.33 పుష్య 8.38 రా 11.45 |
| | 21 | గు | ద 26.47 ఆశ్రే 9.1 రా 10.47 దశమితిథిః |
| | 22 | శు | ఏ 27.15 మ 10.40 రా 2.34 |
| | 23 | శ | ద్వా 28.53 పూఫ 13.29 రా 3.37 గోవత్స ద్వాదశి |
| | 24 | ఆ | త్ర 31.34 ఉఫ 17.19 నరకచతుర్దశి స్నానం |
| | 25 | సో | చతు 35.8 హ 22.4 రా 14.56 మాసశివరాత్రి యమతర్పణం |
| | 26 | మం | ● అమా 39.22 చి 27.30 రా 13.56 దీపావళ్యమావాస్య మహాలక్ష్మిపూజా |
| | | | **కార్తీక మాసము** |
| | 27 | బు | శుద్ధపాడ్యమి 44.1 స్వా 33.21 రా 19.50 కార్తికనక్తస్నాన దీపవ్రతారంభం |
| | 28 | గు | విదియ 48.46 విశా 39.22 రా 21.26 చంద్రోదయం |
| | 29 | శు | తదియ 53.26 అనూ 45.16 త్యాజ్యాభావః |
| | 30 | శ | చ 57.38 జ్యే 50.49 ది 0.26 నాగచతుర్థి |
| | 31 | ఆ | పం 60.10 మూ 55.43 ది 12.20 రా 22.31 |
| 1954 సం॥ నవంబరు నెల | 1 | సో | పం 0.55 పూషా 59.44 ది 21.13 |
| | 2 | మం | ష 3.25 ఉషా 60.10 ది 20.34 త్యా 4.12 |
| | 3 | బు | స 4.42 ఉష 2.22 ది 12.41 |
| | 4 | గు | అ 5.1 శ్ర 4.7 ది 14.14 |
| | 5 | శు | న 3.58 ధ 4.39 ది 21.53 |
| | 6 | శ | ద 1.42 ఏష్యం 46.51 ది 19.31 |
| | 7 | ఆ | ద్వా 53.57 పూభా 2.8 మాధ్వ వైష్ణవైకాదశి |
| | 8 | సో | త్ర 48.32 రే 55.48 ది 27.35 |
| | 9 | మం | చతు 42.31 అశ్వ 51.29 రా 13.34 శుక్రమౌఢ్యారంభం |
| | 10 | బు | ○ పౌ 36.10 భర 46.52 ది 13.32 |
| | 11 | గు | బ పాడ్యమి 29.45 కృ 42.14 ది 14.28 |
| | 12 | శు | విదియ 23.31 రో 38.51 దివ 19.12 |
| | 13 | శ | తదియ 17.44 మృ 34.0 భ 17.44 రా 25.29 |
| | 14 | ఆ | చ 12.39 ఆర్ద్ర 30.53 రా 31.26 |
| | 15 | సో | పం 8.28 పున 28.44 రా 20.0 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Founder : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.



సుఖదుఃఖాల సమన్వయ మూర్తి

